# మాతృమూలం ముక్తి

ప్రేమస్వరూపులారా.

తల్లి, తండ్రి గురువు దైవము అను పదములను ఒకే వరుసలో అందరి నోట వింటుంటాం. ఈ క్రమమునకు ఒక అంతరార్థమున్నది. ఆదిలో ప్రతి జీవికి ప్రప్రథమమున కనిపించునది తల్లి. తల్లే తండ్రిని చూపుతుంది, తండ్రి గురువును చూపుతాడు. గురువు దైవమును చూపుతాడు. అదే విధంగా ఆధ్యాత్మిక మార్గమునందు కూడా భక్తి, జ్ఞానము, వైరాగ్యము, తత్త్వము అనే పదములను ఒకే వరుసలో చూస్తుంటాము. ఈ క్రమమునకు కూడా ఒక అంతరార్థమున్నది. భక్తి జ్ఞానోదయమును కలిగిస్తుంది. జ్ఞానం వైరాగ్యమును చేకూరుస్తుంది. వైరాగ్యము తత్త్వజ్ఞానమును ప్రసాదిస్తుంది. ఈ నాలుగు సోపానములను సరిగా అనుసరించిన ముక్తిసౌధమును చేరవచ్చును. ఇందులకు భాగవతము ప్రత్యక్ష ప్రమాణము.

భాగవతము ఐదక్షరముల పదం. 'భ' కారము భక్తికి, 'గ' కారము జ్ఞానమునకు, 'వ' కారము వైరాగ్యమునకు, 'త' కారము తత్త్వమునకు సాంకేతిక పదములు. 'ము' కారము ముక్తికి మార్గము, భాగవతము భక్తి, జ్ఞాన, వైరాగ్య తత్త్వముల ద్వారా ముక్తి నందించునని అంతరార్థం. భాగవతమునందు ప్రహ్లాదుడు ద్వాదశాక్షరీ మంత్రము నందించాడు.

## వచ్చినత్రోవ

"పుట్టని, చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి" "త్రో వ వె ద కి కొ ను ట దొ డ్డ బు ద్ధి" ఈ పన్నెండు అక్షరములు ప్రధాన మంత్రము. ఏ త్రోవ వెదకుట? ఎక్కడి నుండి వచ్చితిమో, అక్కడికే తిరిగి పోవడం. బ్రహ్మము నుండి వచ్చాము. బ్రహ్మమును చేరాలి, వచ్చిన త్రోవనే పట్టుకొని పోవాలి. మరి బ్రహ్మత్వము నుండి వచ్చామనడానికి ఆధారమేమిటి? 15వ అధ్యాయమందు "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అన్నాడు గీతాచార్యుడైన శ్రీ కృష్ణ భగవానుడు. నాయనా! జీవుడవైన నీవు నా అంశమే. అనాదివి. ప్రకృతి పంచభూతముల అంశానివి కావు. నా అంశమైన నీవు నన్ను చేరునంత

వరకూ శాంతి సుఖములనందుకొనలేవు. బిడ్డ తల్లికి అంశము; తల్లిని విడిచి బ్రతుకలేదు. నది సముద్రమునకు అంశము: సముద్రమునకు దూరమై నిలువలేదు: కొమ్మ చెట్టునకు అంశము; చెట్టును విడిచి బ్రతుకలేదు. చేప జలమునకు అంశము: జలములేక క్షణమైన జీవించజాలదు. అదే విధముగ నీవు నా అంశము. నన్ను విడిచి బ్రతుకలేవు. కనుక నన్ను చేరుటకు ప్రయత్నించు అన్నాడు.

కన్నడమునందు ఒక భక్తుడు "చిన్మయమైన నిన్ను వదలి, మృణ్మయమైన ఈ ధరపై పడ్డానంటాడు. ఈ మట్టి యందు ఎట్టి ఆనందము లభించదు. నీయందే సర్వానందములున్నాయి- నిన్ను మరచిపోవడం వల్లనే నాకీ జన్మ ప్రాప్తించింది" అని వాపోతాడు. భగవంతుని మరువటం వలననే ప్రకృతి యందు జన్మము ఏర్పడుతున్నది. తిరిగి వచ్చిన దారినిపట్టి గమ్యము చేరాలి.

## తిరుగుప్రయాణం

"ఎచ్చట పుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్". ఇదే భాగవతమునందలి ప్రధానమైన బోధ. మనమెక్కడి నుండి వచ్చామన్న విషయాన్ని ఈనాడు మరచిపోయాము. ఇది మన ప్రారబ్ధము, విజ్ఞుడైన వాడీ జన్మముననే తిరుగు ప్రయాణంచేయాలి. అది చేయవలసిన ప్రధాన సాధన. ఆత్మను వెదకుటకై వచ్చిన మానవుడు ఈనాడు అన్నమును వెదకుటకై కాలాన్ని వ్యర్థంచేస్తున్నాడు. ఇది మానవుని బుద్ధి కాదు. ఇది గొడ్డుబుద్ధి. దొడ్డబుద్ధి కలిగినవాడు తిరిగి బ్రహ్మత్వములో చేరాలి ఆహారనిద్రా భయమైథునాదులు పశు, పక్షి, మృగాలూ అనుభవిస్తున్నాయి. మానవుడు కూడా అనుభవిస్తున్నాడు. వీటి నిమిత్తంకాదు మానవుడు వచ్చింది. దుర్లభమైన మానవ జన్మను దైవత్వాన్ని గుర్తించుటకు అంకితం గావించాలి. "దైవమునకు నివాసం కావలసిన హృదయమునందు దుర్గుణములు, దురాలోచనలు తిష్ఠవేసినవని" చైతన్యుడు చెప్పాడు. హృదయపీఠము భగవంతుని స్థానము. ఇది దుర్భావముల దురాలోచనల నివాస స్థానము కారాదు. దీనిని పవిత్రమైన పరమాత్మ స్థానముగానే భద్రపరచుకోవాలి. సంసారమును పొందుట సత్యమేకాని, మన వెంట వచ్చేది సంసారముకాదు. సంస్కారము. కొందరు పెద్దలు 'స్వామీ! మాకేదైనా మార్గము బోధించమని' ప్రార్థిస్తుంటారు. ఏమిటీ మార్గము? వచ్చిన మార్గమున పోవడమే మార్గం. స్వస్థానము చేరడమే మన ధర్మము.

పనిమీద పట్టణానికి వెళ్ళి బసవేసిన హొటల్ సత్యమైనదని భావించి, దానిలోనే నివసించుట వీలుకాదు, ఈ ప్రకృతి ఒక హొటల్ వంటిది. కర్మ ప్రాప్తి నిమిత్తమై కర్మయాత్రచేస్తూ ఈ మందిరమును చేరాము. దేహమనే దేవాలయం ఒక పట్టణం వంటిది. పట్టణంలో పనిపూర్తి అయ్యేవరకే నివసించాలి గాని, శాశ్వతముగ నివసించడానికి వీలుకాదు. ఇది బాడుగ ఇల్లు, పైగా మట్టితో కట్టినది. ఎంతో కాలము ఉండటానికి వీలులేదు. కనుక జీవితలక్ష్యాన్ని గుర్తించడానికి కాయాన్ని, కాలాన్నీ వినియోగించాలి.

## జీవితానికి హద్దులు

మనము ధన కనక వస్తువాహనాలనే

ప్రోగుచేసుకొంటున్నాము. లౌకిక జీవనమునకు ధనము కావలసినదే. ఐతే దానికి ఎంతోకొంత హద్దుండాలి. "నశ్రేయో నియమం వినా" జీవితానికి హద్దులు ఏర్పరచుకోవాలి. ఏదీ మన వెంటరాదు. కనుక ఉన్నంతలో జీవిత గమ్యాన్ని సాధించడానికే ప్రయత్నించాలి. కానీ మనము వచ్చిన పనిని మరచి, తాత్కాలిక విషయాలను లక్ష్యమునందుంచుకొని కాలమును వ్యర్థము చేస్తున్నాము. పగిలిన పాత్రలోని నీటివలె మన ఆయుఃప్రమాణం క్షణక్షణం తరిగిపోతున్నది. కర్తవ్యాన్ని గుర్తించకమునుపే కాయాన్ని వదలుతున్నాము. కనుక దేహియే దేవ దేవుడనే సత్యాన్ని గుర్తించాలి. కేవలం అన్నపానాదులతో జీవితాన్ని వ్యర్థంచేసుకోవడం సార్థకత్వం కాదు.

భాగవతం బోధిస్తున్న సందేశాన్నిబట్టి మానవునికి ప్రధానమైనది భక్తి. భక్తిచిహ్నం తల్లికాగా, జ్ఞానానికి చిహ్నంతండ్రి. వైరాగ్యానికి చిహ్నం గురువుకాగా, తత్త్వస్వరూపుడు దైవం మొదట తల్లి ప్రేమను అభివృద్ధి గావించుకోవాలి. "మాతృ దేవో భవ" తల్లి మొదటి గురువు. ప్రేమించి బోధించి ఉన్నత స్థాయికికొనిపోయేది తల్లి. అయితే ఈనాటి పుత్రులకు తల్లి ఆస్తిపాస్తులు కావాలికాని, ఆ తల్లి అజ్ఞ అవసరము లేదు. ఇట్టి పుత్రులు కలిగి ప్రయోజనమేమిటి?

## చేతులు రెండు పొట్ట ఒక్కటే

చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తినుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు

కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యములన్నీ ఇందులోనే ఇమిడి ఉంటున్నాయి. ప్రతీ వ్యక్తిమంచి కర్మలాచరించడానికి ప్రయత్నించాలి. "చేతులారంగ శివుని పూజింపడేని" చేతులతో చేయవలసినది పని, కర్మ. పద్యము చిన్నదే కాని దీని భావము, పవిత్రత అనంతము. చేతులతో పని చేయాలి. అనేకమంది తిండిలేదే, తీర్థం లేదే అని వాపోతుంటారు. దేవుడు చేతులు రెండు ఇచ్చాడు, పొట్ట ఒకటిచ్చాడు. రెండు చేతులు పనిచేస్తే, ఒక పొట్ట నిండదా? కాని తన పొట్ట మాత్రం నిండాలి, పని మాత్రం చేయకూడదు. ఇది సోమరితత్త్వము. సోమరికి భుజించడానికి కూడా అధికారం లేదు. మొట్టమొదట పని చేయాలి. వేదం కూడా కర్మకాండకే ప్రాధాన్యమిచ్చినది.

## నాలుక ప్రాశస్త్యం గుర్తించు

"నోరు నొవ్వంగ హరికీర్తినుడువడేని"— మంచి మాటలు మాట్లాడాలి. ఇతరులను దూషించరాదు. అందరి హృదయాలలోను భగవంతుడున్నాడు. కాబట్టి ఎవరిని దూషించినా, తనను తాను దూషించుకొన్నట్లే. "పాపములన్నింటికంటె మించినది పరులను నిందించేదన్నా" పరనింద మహాపాతకం. నాలుక చాలాపవిత్రమైనది. ఎన్ని బాధలున్నా నోటనే ఉంటుందిగాని బయటకురాదు. ప్రతి పదార్థాన్ని రుచిచూచి, అది మంచిదిగా ఉంటేనే జఠరాగ్నికి పంపిస్తుంది. చేదుగా అరుచిగా ఉంటే పరిత్యజిస్తుంది. రుచికరంగా ఉంటే జఠరాగ్నికి పంపుతుందేకాని, తాను అనుభవించదు. అట్టి త్యాగగుణం కగినది. సహనంలో నాలుకను మించినది మరొకటి లేదు. పదునైన

32 దంతముల మధ్య ఉంటూ సహనముతో జీవితాన్ని గడుపుతుంది. పవిత్రమైన ఇట్టి నాలుకను అపవిత్రమైన మాటలను ఉచ్చరించడానికి వినియోగించడం మంచిది కాదు. దీనిని సక్రమంగా ఉపయోగిస్తే దైవాన్నే పొందవచ్చును. భగవంతుని నామమును నాలుకపై నాట్యమాడించాలి. సత్యమును పలకాలి. మధురమైన పదములను ఉపయోగించాలి. కఠినమైన పదములను ఉపయోగించరాదు. అసత్యమాడటం, చాడీలు చెప్పడం. పరులను దూషించడం, అతిగా మాట్లాడటము— ఈ నాలుగు నాలుకచేసే పాపములు. ఈ నాలుగింటిని అదుపులో పెట్టుకొంటే నాలుక పవిత్రమై పోతుంది.

## పుండరీకుని ఆదర్శం

కని, పెంచి, పెద్దచేసి, కీర్తి మర్యాదలను పొందమని అశీర్వదించే మాతృ ప్రేమను హృదయమందు భద్రం చేసుకోవాలి. మాతృ ప్రేమకు దూరమైన వ్యక్తి ఇంకెవ్వరి ప్రేమను పొందలేడు. పుండరీకుడు వృద్ధులైన తన తల్లి దండ్రిల సేవనే ప్రధానముగా భావించాడు. తల్లి దండ్రుల పాదసేవచేసిన తర్వాతనే భుజించేవాడు. వారు నిం(దించే వరకు తాను నిం(దించేవాడు కాదు. పుండరీకుని పరీక్షించడానికి భగవంతుడు పాండురంగని రూపంలో వచ్చి అతని వెనుక నిల్చున్నాడు. 'పుండరీకా! ఇటుచూడు!' అన్నాడు. 'చూస్తున్నాను' అని అన్నాడు పుండరీకుడు. "ఏ రూపం చూస్తూ ఉన్నావు?" అని పాండురంగడు ప్రశ్నించాడు. "నా తల్లి దం(డుల రూపం" అని అన్నాడు పుండరీకుడు. ఇంతలో పుండరీకుని గురువు అక్కడికి వచ్చి, "పుండరీకా! వచ్చినదెవరనుకొన్నావు? భగవానుడు" అని గట్టిగా హెచ్చరించాడు. "ఔను దేవుడే!" అంటూ తల్లిదం(డుల సేవలోనే నిమగ్నుడైనాడు పుండరీకుడు. అప్పుడు పాండురంగడే స్వయముగా "పుండరీకా! ఒక్కసారి నన్ను దర్శించవా!" అన్నాడు. "నా తల్లి నిద్రించే వరకు నిన్ను దర్శించడం వీలుపడదన్నాడు. నీవు నాకు దర్శనమివ్వాలనే అనుకుంటే, అంత వరకు ఆ ఇటుకమీద నిల్చో!" అని ఒక ఇటుకను విసిరాడు. పుండరీకుని మాతృ ప్రేమను పరీక్షించ వచ్చిన పాండురంగడు ఆ ఇటుక పైన నిలచి పుండరీకుని సేవకుడయ్యాడు!

## ఏది స్వస్థానం

భవిష్యత్తులో ఎవరు ఏమయ్యేదీ పుట్టుకతోనే ప్రారంభమవుతుంది. తల్లి గర్భం నుండి పుట్టిన తక్షణం "క్వా - క్వా" అని ఏడుస్తారు. అంటే నేనెక్కడి నుండి వచ్చాను, ఎక్కడి నుండి వచ్చానంటూ ఏడుస్తారన్న మాట. పుట్టిన వెంటనే "ఎక్కడ - ఎక్కడ" అని స్వస్థానం గురించి ప్రశ్నిస్తారు. కాని దురదృష్టవశాత్తు మోహంలో మునిగి స్వస్థానమును పూర్తిగామరచి, లోకమే సత్యమని భావిస్తారు. కొందరు "సోహం-సోహం" అని ఉచ్చరిస్తుంటారు. వీరు మహాయాస్తికులు. ప్రహ్లాదుడు, ధ్రువుడు, వాసుదేవుడు ఇటువంటివారు. వీరందరూ పుట్టుకతోనే "సోహం- సోహం" అంటూ పుట్టారు. కాని సామాన్య మానవులు "కోహం-కోహం" అంటూ పుడతారు. చచ్చేంతవరకు కూడ వారికి ఈ ప్రశ్నకు సమాధానం చిక్కడంలేదు! ఎందుకోసం వచ్చాము? ఏమి

చేస్తున్నాము? వచ్చినపని ముగించుకోవాలి. సర్వత్రా దైవత్వాన్ని చూడాలి, దివ్యత్వంతో జీవించాలి. పవిత్రంగా జీవించి జీవితాన్ని సార్థకం గావించుకోవాలి.

## దేహమే ఆస్తి

భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్త్వాలను బోధించే వారు తల్లి, తండ్రి, గురువు, దైవము. ఇవే మన జీవితానికి గమ్యం. తెలిసో, తెలియకో పొరపాట్లు చేసినప్పటికీ తల్లి ప్రేమను గుర్తించి జీవితాన్ని సార్థకము గావించుకోవాలి. తల్లి దండ్రులను ప్రేమించడం వారి ఆస్తి పాస్తుల కోసం కాదు. వారు మనకు ఎంతో గొప్ప ఆస్తి నిచ్చారు. దేహము, మనస్సు, బుద్ధి, చిత్తం, అంతఃకరణ వారు అనుగ్రహించిన వరప్రసా దములే. మన జీవితానికి అధికారి భగవంతుడే అయినా, దేహానికి అధికారులు తల్లి దండ్రులు. దేవుడు మట్టిని, నీరును సృష్టిస్తే, కుమ్మరి మట్టిని నీటినీ కలిపి కుండను సృష్టించాడు. దేహమనే కుండకు తల్లి దండ్రులే అధికారులు. కనుక మొదట వారికి కృతజ్ఞులమై ఉండాలి. నీవు నీ తల్లి దండ్రులకు ఎట్టి దుఃఖాన్ని కలి గిస్తావో? నీ బిడ్డలు నీకు అట్టి దుఃఖాన్నే కలి గిస్తారు. నీవీనాడు నీ తల్లి దండ్రులకు కంట నీరు నింపితే, నీ బిడ్డలు నీ కంటనీరు నింపడం తథ్యం. కర్మకు ప్రతిఫలం తప్పదు. ధన, జన, బల గర్వం ఎంతో కాలం ఉండదు. దీనిని నమ్ముకొని, సత్యమైన, నిత్యమైన, భవ్యమైన- దైవత్వాన్ని విస్మరిస్తున్నాము. ఎన్ని జన్మల కైనా దైవత్వాన్ని పొందకతప్పదు. దైవత్వాన్ని పొందక ఈ జీవితంలో శాంతి లేదు. ఒక్క దైవత్వము మాత్రమే మనకు శాంతినిచ్చేది. భవనాలు, ఎయిర్‌కండిషన్ గదులు, డన్లప్ సోఫాలు ఎన్ని ఉన్నా మన మనస్సునకు శాంతి ఉండదు. మనస్సు వేడెక్కుతూనే ఉంటుంది. ఒక్క దైవానుగ్రహం మాత్రమే నిరంతరం చల్లదనాన్నిచ్చేది. అట్టి దైవత్వాన్ని అందుకొన డానికే మానవజన్మ ప్రాప్తించింది. జన్మను సార్థకం చేసుకోవడానికి మొదట తల్లి దండ్రి, గురువుకు కృతజ్ఞత చూపితే ముమ్మూర్తి స్వరూపమైన దైవత్వానికే అది చెందుతుంది.

## ధృతరాష్ట్రప్రేమ ప్రమాదకరం

నేటి ఆధునికయుగంలో నూటికి 90 పాళ్ళు తల్లి దండ్రులే పిల్లలను పాడుచేస్తు న్నారు. ఇష్టమొచ్చినట్లు అధికారమిస్తున్నారు. తప్పులుచేస్తే దండించటం లేదు. పాపాలకు ఒడిగడితే నిందించటం లేదు. ఫలితంగా వారు మరింత పాతకులుగా మారిపోతున్నారు. అటు వంటి కుమారులను తల్లి తండ్రులు ఏమాత్రం క్షమించరాదు. పుత్రప్రేమ ఉండవచ్చును. కాని ధృతరాష్ట్ర ప్రేమవలె ఎన్ని అక్రమాలు అనాచారాలు చేసినా క్షమిస్తూపోరాదు. ధృత రాష్ట్రుడు కృష్ణుని బోధలను విస్మరించాడు. విదరుడు ఎంత చెప్పినా వినలేదు. నా పుత్రులు గొప్పవారని విఱ్ఱవీగాడు. కాని ఆ పుత్రులు ధృతరాష్ట్రునికి కలిగించిన సంతోషమేమిటి? పుత్రులు కావాలని తల్లులు కోరుకొంటారు. పుత్రులు లేకపోతే "పున్నామ నరకము"ని భావిస్తారు. కాని ధృతరాష్ట్రునికి ఎంత మంది పుత్రులు పుట్టలేదు? శుకునికి పుత్రులే లేరే! శుకునికి ఏమి దుర్గతి పట్టింది. ధృతరాష్ట్రునికి ఏమి సద్గతి కలిగింది? పుత్రుడు పుట్టినప్పుడు సంతోషించరాదు. పెరిగి సత్కీర్తి తెచ్చినప్పుడు

సంతోషించాలి. ఒక్క కొడుకు పుడితే 'తీపి' పంచుతారు. పందికి పదిపిల్లలు పుడితే, అది ఏతీపిని పంచుతున్నది? పుత్రుడవై పుట్టినందు లకు తల్లిని సంతోషపెట్టాలి. ఒక్క ప్రేమతప్ప, మరేమీ ఆమెనుండి కోరకూడదు. ఆ ప్రేమయే సర్వస్వంగా మారిపోతుంది.

## ఈనాడు అంతా హిరణ్యకశిపులే

ఈనాటి పిల్లలు తల్లి దండ్రుల నుండి నగలు నాణ్యాలు, చీరలు, ఆస్తిపాస్తులు మాత్రమే కోరుతున్నారు అట్టి పుత్రులు బ్రతికినా చచ్చినట్లే. కీర్తిని సంపాదించే పుత్రులే పుత్రులు. వారిని కన్నతల్లులే తల్లులు. అట్టి పుత్రులు, అట్టి తల్లులున్నప్పుడే దేశం బాగుపడుతుంది. దేశం బాగుపడితే విశ్వమంతా బాగుపడుతుంది. విశ్వకళ్యాణం వ్యక్తిమీదే ఆధారపడి ఉంది. ప్రహ్లాదుని తల్లి లీలావతి, భర్త హిరణ్యకశిపుని పోరుపడలేక "నీవు హరి-హరి అనడం వల్లనే, నీ తండ్రి నిన్ను ఇంతగా బాధిస్తున్నాడురా!" అని చెప్పిచూసింది, ఈనాడు ఈ ఆధునికయుగంలో చాలా మంది హిరణ్యకశిపులు తయారైనారు. పిల్లలు గుడికి వెళ్ళి దేవుని పూజిస్తే "వీడికి దేవుడి పిచ్చి పట్టిందంటారు!" స్వామి దగ్గరకువస్తే వీడికి "సాయిబాబా పిచ్చి" అంటారు. మరేపిచ్చి పట్టాలి? రౌడీగా,గూండాగా, దొంగగామారేపిచ్చి పట్టాలా? ధనం పిచ్చి పట్టాలా! దైవప్రేమయే నిజమైన ధనం. కాని ఈ రోజుల్లో ఆ ధనం అక్కర లేదు. లౌకిక ధనం కావాలి. మనం దైవానికి అర్పితమైతే తల్లి సంతోషిస్తుంది. దైవమార్గంలో సోదరుడు, తండ్రి ఎవరు అడ్డువచ్చినా— త్యజించవలసిందే. ప్రహ్లాదుడు తండ్రిని త్యజించాడు. విభీషణుడు సోదరుని త్యజించాడు. దైవం నుండి నిన్ను దూరం చేయడానికి తల్లి ప్రయత్నించినా, ఆమెను కూడా త్యజించవలసిందే! దైవమార్గానికి అడ్డుతగిలే భర్తనయినా మీరావలె త్యజించవలసిందే. బలిచక్రవర్తి శుక్రాచార్యుని త్యజించినట్లు గురువునైనా సరే త్యజించవలసిందే.

## దైవమే తల్లి, తండ్రి

సర్వులకు దైవమే ఆధారము. దైవాన్ని వదలి, దయ్యాన్ని పట్టుకొని నానాబాధలు పడుతున్నారు. మానవుడు తన జీవితలక్ష్యాన్ని గుర్తించాలి. మానవుడై పుట్టినందుకు మానవుడుగా జీవించి జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. నేటి మానవుడు మానవరూపంలో దానవుడై జీవిస్తున్నాడు. ఎన్ని జన్మలెత్తితే ఈ జన్మ లభించిందో! నరజన్మనే కడజన్మ. ఉన్నంతవరకు మాతా పితరుల సేవ చేయవలసిందే. కాని, "మాతా నాస్తి, పితా నాస్తి" దైవంలోనే తల్లిని, తండ్రిని చూడాలి. ఏకత్వాన్ని మనం అనుభవించాలి. "జన్మదుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం, పునః పునః". మన దుఃఖం దీనితో అంతం కావాలి. అంత్యజీవితం శాంతంగా గడుపాలనుకొంటే, చేయవలసినవి సక్రమమైన పనులు చేయాలి. దైవచింతన సాగించాలి.

—శ్రీవారి దివ్యబోధ
(ఈశ్వరాంబ దినసందేశం)
బృందావనం, 6-5-1987.

# విశ్వమాత నీవు - ఈశ్వరాంబ!

" శ్రీరామభద్రు "ని ప్రియమారగా గన్న।
చల్లని తల్లి " కౌసల్య " వీవు
" కృష్ణ పరంజ్యోతి " నింపారగా గన్న।
వజ్రాలతల్లి " దేవకివి " నీవు
" గరుడ " మహావీరు గడుపారగా గన్న
వీరవర్యుల తల్లి " వినత " వీవు
" షిర్డిసాయీశు "ని చెలువారగా గన్న
బంగారుతల్లి " దేవగిరి " వీవు

నిత్య భగవానుడైన " శ్రీ సత్యసాయి "
రత్నమును గన్న " రత్నాకరంబు " వీవు
ధర్మగుణముల రత్నాల తల్లి " ఈశ్వ
రాంబ ! " జగదాంబ ! వందనలందుకొమ్ము !

విశ్వబాల కాళి విద్య నేర్పు నిచట
విశ్వజనము వచ్చి ఎడిదిసేయు
" విశ్వవేదిక "య్యె విపులమై పుటపర్తి
విశ్వమాత వీవు—ఈశ్వరాంబ !

—" శాంతిశ్రీ " జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి



## శ్రీ సత్యసాయి హైయ్యర్ సెకండరీ స్కూలు, ప్రశాంతినిలయం.

సెకండరీ ఎడ్యుకేషన్, సెంట్రల్ బోర్డు, న్యూఢిల్లీ వారి అనుబంధిత పాఠశాల— ఇంగ్లీషు మీడియం హైయ్యర్ సెకండరీ స్కూలుకై నిమ్నలిఖిత పదవులు జులై 1991లో నింపుటకై అప్లికేషన్లు పంపవచ్చును.

| పదవి | పేస్కేలు | పదవుల సంఖ్య |
|---|---|---|
| 1. ప్రిన్సిపాల్ | 1810-3230 | 1 |
| 2. పీ. జి. ట్రెయిన్డు టీచర్లు | 1550-3050 | |
| I) పొలిటికల్ సైన్సు | | 1 |
| II) సంస్కృతము | | 1 |
| III) బయోలజీ | | 1 |
| IV) ఫిజిక్సు | | 2 |

| పదవి | | పేస్కేలు | పదవుల సంఖ్య |
|---|---|---|---|
| V) కెమిస్ట్రీ | | | 1 |
| VI) అకౌంటెన్సీ | | | 1 |
| VII) తెలుగు | | | 1 |
| VIII) ఇంగ్లీషు | | | 1 |
| IX) ఎకనామిక్సు | | | 1 |
| X) హిస్టరీ | | | 1 |
| 3. టీ. జి. టీచర్ | I) బయోలజీ | 1280-2440 | 1 |
| | II) హిస్టరీ | | 1 |
| | III) ఫిజిక్సు | | 1 |
| | IV) తెలుగు | | 1 |

విషయము (సబ్జెక్టు)లో ఫస్ట్ క్లాస్ మాస్టర్సు డిగ్రీ మరియు టీచర్సు ట్రైనింగ్ డిగ్రీతో సహా కనీసము 5 సంవత్సరముల టీచింగ్ / అడ్మినిస్ట్రేటివ్ అనుభవము (ఎక్స్‌పీరియన్స్) (3వ పదవికి తప్ప) కలవారికి ప్రాముఖ్యత ఇవ్వబడును. మిగతా విషయాలు అభ్యర్ధనపై తెలుపబడును.

పేస్కేలుతో సహా, ఆంధ్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఇవ్వబడు అలెవెన్సు, నియమింపబడిన టీచర్లకు ఇచ్చే అర్హత గుర్తింపబడును. అన్ని అర్హతలు కలిగిన అభ్యర్థులకు అధిక వేతనము ఇచ్చే అవకాశము ఉండవచ్చును.

సాదా కాగితంపై ఎడ్యుకేషనల్ క్వాలిఫికేషన్ (అర్హతలు) అనుభవము వివరిస్తూ, కరెస్పాండెంట్, శ్రీసత్యసాయి హైయ్యర్ సెకండరీ స్కూలు, ప్రశాంతినిలయం, 515134, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్‌కు 15-జూన్-1991లోగా పంపించవలెను. ఇంటర్వ్యూకై అభ్యర్థులు తమ స్వంత ఖర్చులతో, స్వల్పనోటీసుపై రావడానికి తయారుగా ఉండవలెను.

గవర్నమెంట్ లేక గవర్నమెంట్ ఎయిడెడ్ స్కూలులో పనిచేసే అభ్యర్థులు తమ అప్లికేషనును ప్రాపర్ ఛానెల్ ద్వారా పంపవలెను. (ఒక అడ్వాన్సు కాపీ నేరుగా పంపవచ్చును.)

# ఆత్మజ్ఞానము - భౌతికజ్ఞానము

"భగవంతుడు ఆకాశముకంటె నిర్మలమైనవాడు. సూర్య చంద్ర నక్షత్రాదులు దైవము యొక్క నేత్రములే. దైవము వాయువువలె సర్వత్రా వ్యాపించియున్నాడు. మానవోపాధులైన దేహేంద్రియ, మనో బుద్ధుల తత్త్వాన్ని చక్కగా గుర్తించినప్పుడే విశాలమైన, నిర్మలమైన, పవిత్రమైన ఆత్మ తత్త్వము దైవత్వము మనకు అర్థమవుతుంది".

విద్యార్థులారా!

"క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతంమమ"

క్షేత్రము —— క్షేత్రజ్ఞుడు

ప్రపంచమంతయు క్షేత్ర క్షేత్రజ్ఞుల సమ్మిశ్రితమైన స్వరూపము. ప్రకృతిప్రతిబింబమే మానవుని శరీర క్షేత్రము. విశ్వమునందున్న చేతనాచేతనములు అన్నీ మానవుని దేహమందే ఇమిడి ఉన్నవి. ఈ ప్రపంచ మంతయు మానవుని యందుండిన ప్రతిబింబమే. (Reflection of the inner being). ఈ శరీర ఇంద్రియ, మనో బుద్ధులను గుర్తించినంతమాత్రమున చాలదు. ఈ క్షేత్రమును గుర్తించే క్షేత్రజ్ఞుడు ప్రత్యేకముగా ఉంటున్నాడు క్షేత్రజ్ఞుని గుర్తించినట్లైతే క్షేత్ర విచారము మనకు అక్కరలేదు. అంతవరకు మాత్రము క్షేత్రాన్ని తగిన రీతిలో అనుభవించుటకు తగిన ప్రయత్నము చేయాలి. ఈ క్షేత్రజ్ఞుని తెలుసుకోవాలనుకొంటే జ్ఞానము కావాలి.

ఏమిటీ జ్ఞానము? కేవలము పుస్తక జ్ఞానము కాదు. సూపర్‌ఫిషియల్ నాలెడ్జినా? కాదు. జనరల్ నాలెడ్జినా? అనరేకాదు. Descrimination నాలెడ్జినా? ఇది వ్యక్తిగతమైనది. Experience నాలెడ్జా? మరియు Practical నాలెడ్జి కూడా వ్యక్తిగతమైనదే. ఇవి అన్నియు భౌతికమైన, లౌకికమైన జ్ఞానములు. వస్తు విచారణచేత గుర్తింపబడే జ్ఞానము పదార్థజ్ఞానము. విషయమును ఆధారము చేసికొని దాని విశిష్టతను గుర్తించే జ్ఞానము విషయ జ్ఞానము. ఈ విధములైన జ్ఞానములచేత దివ్యమైన ఆత్మ తత్త్వమును ఎవ్వరూ గుర్తించలేరు. వజ్రమును కోయవలెనంటే వజ్రమే కావాలి. కాలిలో విరిగిన ముల్లును తీయాలంటే ముల్లే కావాలి. ఆత్మ తత్త్వమును గుర్తించాలంటే ఆత్మ జ్ఞానమే కావాలి.

ఈనాడు భౌతికమైన ప్రపంచమునందు దేనిని జ్ఞానమని భావిస్తున్నామో అదంతా అజ్ఞానమే. ఆత్మ జ్ఞానమే సత్యజ్ఞానము. ఆత్మ అన్నా, జ్ఞానమన్నా రెండూ ఒక్కటే. నిజమైన ఎఱుకయే జ్ఞానము. పదార్థములను క్రోడీకరించుకొని, విషయములను సంగ్రహించుకొని తద్వారా తెలుసుకొనే జ్ఞానము అజ్ఞానముతో సమానమే. జ్ఞానమునకు జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అనే త్రిపుటి ఉండదు. ఇవి మానసిక సంబంధమైన వృత్తులు. మనోనాశనమైన తరువాత ఏర్పడే మూలాధారమైన తత్త్వమే ఈ జ్ఞానము.

## మనస్సే భ్రాంతి

మానసిక సంబంధమైన విచారణ శక్తులన్నీ భ్రమలే. ఇది వ్యక్తిపై ఆధారపడి ఉంటుంది. మానవుడు చూచినది, విన్నది, అనుభవించినది, ఆచరించినది ఇవన్నియు దేహాత్మతో కూడిన మనస్సుయొక్క భ్రమలు. కేవలము దేహతత్త్వమే ఈ మనస్సుయొక్క స్వభావము. మనస్సు ఒక ఆకారమును, విషయమును, వస్తువును వదలి ఒక్క క్షణమైనా ఉండుటకు వీలుకాదు కనుకనే మనస్సు దేహాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఈ దేహమునకు ఉండిన కన్ను, ముక్కు, చెవులు, నోరు— వీటి ద్వారానే మనస్సు ఈ పంచభూతములన్నింటిని అనుభవిస్తున్నది. మనస్సు దేహముయొక్క నేత్రములద్వారా చూస్తుంది. దేహముయొక్క కర్ణములద్వారా వింటున్నది. మనస్సునకు రూపము లేదు. మనస్సే మాయ. మనస్సే కోరిక, మనస్సే ప్రకృతి. మనస్సే అవిద్య. మనస్సే ప్రాకృతమైన భ్రాంతి. ఇట్టి భ్రాంతితో కూడిన మనస్సుద్వారా సత్యనిత్యమైన బ్రహ్మతత్త్వమును మనం అర్థం చేసుకొనుట చాలా కష్టము.

## మనోనాశనమే జ్ఞానం

ఏది నిజమైన జ్ఞానము? మనస్సుచేత ఇంద్రియములను స్వాధీన పరచుకొని, ఇంద్రియ నాశనము గావించిన తరువాత మనస్సు అంతర్ధానమవుతుంది. ప్రశాంతమైన మౌనతత్త్వము ఏర్పడుతుంది. ఈ మనోనాశనము వలన కలిగిన మౌనమనేదే నిజమైన జ్ఞానము. ఈ జ్ఞానము తెలివితేటల వల్లగానీ, బుద్ధి కుశలత వల్లగానీ, మరి ఏవిధమైన ఆదర్శము వల్లగానీ లభించేది కాదు. ఇది సహజము. ఇది క్రొత్తగా మనము సంపాదించుకొనే వస్తువు కాదు. నివురుగప్పిన నిప్పువలె, పాచి కప్పిన జలమువలె, పొర కప్పిన కన్నువలె— మనో భ్రాంతి కప్పిన ఆత్మగా ఉండుటచేత ఈ జ్ఞానమును మనం గుర్తించలేకపోతున్నాము. జ్ఞానము గ్రంథాల వలన లభించేది గాదు. గురువులు ప్రసాదించేది కాదు. పరమాత్ముడు అందించేది కూడా కాదు. తానే పరమాత్మ, తానే జ్ఞానము, తానే ఆత్మ.

## అంతర్వాణి

జగత్తునందు సమస్త పదార్థములు మార్పు చెందుతున్నాయి. ఆకారములు మార్పులు చెందుతున్నాయి. ప్రతి పదార్థము అణు ప్రభావమే. ఈ అణువుల చేరికయే పదార్థ స్వరూపము. కాలక్రమేణా ఈ అణువులు వేరైపోతుంటాయి. అణువుల స్వభావము సంయోగ వియోగముల తత్త్వమే. కానీ మార్పు చెందని, కూర్పుకలగని ఒక దివ్యవాణి సర్వులయందు ఒక్కటిగానే ఉంటున్నది. బాల్యమునందు, యవ్వనమునందు, వార్ధక్యమునందు దేహము మార్పు చెందుతున్నదికానీ ఆ వాణి మార్పు చెందుట లేదు. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అనే మూడు అవస్థలు మనము అనుభవిస్తున్నామే కానీ, ఈ వాణి మార్పు చెందుట లేదు. స్థూల, సూక్ష్మ, కారణములు మనం అనుభవిస్తున్నామే కానీ, ఈ వాణి మార్పు చెందుట లేదు.

ఏమిటీ వాణి? ఆత్మతత్త్వము నుండి వెలువడిన దివ్యమైన అంతర్వాణి. అదియే "నేను-నేను". దీనికి మరొక పేరు "అహం". ఇదే సత్యమైనది.

"అహం" దివ్యమైనవాణి. దీనిని పాండిత్యముచేత గాని, ధీశక్తిచేతగాని గుర్తించుట అసాధ్యము. ఎంత గొప్ప పండితుడైనప్పటికీ దృష్టిలేకుండిన వస్తువులను చూడలేడు. పాండిత్యము తెలియనప్పటికీ, పామరుడై నప్పటికీ కన్నులున్నవాడు వస్తువులను స్పష్టముగా చూడగలుగుతాడు. వేద శాస్త్రేతిహాస పురాణములు అన్నియు పఠించిన మహాశాస్త్రజ్ఞులైనప్పటికీ నిద్ర యందున్నప్పుడు, జాగ్రత్ ప్రపంచమును ఏమాత్రం చూడలేరు. కాని మేలుకొనియున్న వ్యక్తి ఏశాస్త్రములు చదవకపోయినప్పటికీ, ఏమీ తెలియకపోయినప్పటికీ జాగ్రత్ ప్రపంచమును చూడగలగుతున్నాడు. అదే విధముగనే మానవుడు గుర్తించలేని ఆత్మశక్తిని, ఆత్మజ్ఞానమును చిత్తశుద్ధిచేత గుర్తింపగలుగుచున్నాడు.

## ఆత్మ సర్వత్రా ఉంటున్నది

మనస్సుకు ఈవల నుండి చూచినంతవరకు మనకు జగత్తే గోచరిస్తుంది. మనస్సుదాటి ఆవల చేరితిమా, ఆత్మ గుర్తింపబడుతుంది. మనము అనుభవించే జ్ఞానములు, అనుభూతులు సర్వము మనస్సునకు ఇవతల నుండియే అనుభవిస్తున్నాముకాని, మనస్సునకు ఆవల చేరలేదు. సముద్రములో చేరిన నదికి ప్రత్యేక రూప నామములు ఉండవు. ఎప్పుడు సముద్రములో చేరిపోయెనో, అప్పుడు తన రూప నామములను కోల్పోతుంది. సముద్రము ఒక్కటే నిలుస్తుంది. అదియే "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి". బ్రహ్మతత్త్వమును కనుగొనుటకు బ్రహ్మజ్ఞానమే కావాలి. ఆత్మతత్త్వమును అర్థము చేసుకోవటానికి ఆత్మజ్ఞానమే కావాలి ఆత్మతత్త్వాన్నిగుర్తించాలని ఆశపడే సాధకుడు భౌతిక క్రియలచేత ఆత్మతత్త్వాన్ని పొందలేడు. ఆత్మ సర్వత్రా ఉంటున్నది. ప్రపంచమంతా ఉండినది ఈ ఆత్మచైతన్యమే. దేహమున్నంత మాత్రమున మనకు గోచరిస్తున్నదనుకోవడము మన మానసిక కల్పనయే. ఘటముండినా లేకపోయినా, ఘటమునందు జలము ఉండినా, లేకపోయినా సూర్య ప్రతిబింబము సర్వత్రా ఉంటునేయున్నది. ఘటము, ఘటములోని జలము ఉండినప్పుడు మనకు ప్రత్యక్షముగా గోచరించవచ్చునేగాని, అది లేనప్పుడు ఇవి లేదని చెప్పుటకు వీలుకాదు. దేహముండిన, లేకపోయినా-మనస్సు ఉండిన, లేకపోయిన ఆత్మ అక్కడ ఉన్నది.

నీవు అనుభవించే అనుభూతులు దేనికి సంబంధించినవి? దేహమనే పాత్రలో మనస్సనే జలము ఉండుటచేత అందులో నీవు ఏదో ఒక భ్రాంతిచేత నీ రూపాన్ని నీవు చూడగలుగుతున్నావు. పోనీ అది సత్యము అని విశ్వసిస్తామా అంటే, అది సత్యము కాదు. ఇది నీ ప్రతిబింబమే. కాదని చెప్పుటకు వీలు కాదు. సాక్షాత్తు ప్రతిబింబంకాదు. ఎట్లనగా జలములో నీ ముఖము నీవు చూస్తున్నావు. నీ ముఖమే కనిపిస్తున్నది కాని, ఉల్టాసీదాగా ఉంటున్నది. Left eye Right eye గా కనిపిస్తుంది. Right eye Left eye గా కనిపిస్తుంది. కనుక ఇది సత్యమెట్లవుతుంది? భ్రాంతిచేత ఇది నా ప్రతిబింబమని విశ్వసిస్తున్నావు. ఈ దేహము భ్రాంతితో కూడినదే. దివ్యతత్త్వాన్ని గుర్తించాలనుకొంటే, దేహం అక్కరలేదు. మనస్సు అక్కరలేదు. దీనిని సరిగా అర్థము చేసుకొనేంత వరకు దేహేంద్రియ, మనోబుద్ధులను చక్కగా పోషించుకోవాలి. దేహము, ఇంద్రియములు, మనస్సు బుద్ధి ఉండాలి. వాటిని సక్రమమార్గములో అనుభవించాలి. పెడమార్గంలో ప్రవేశపెడితే అనేక బాధలకు, దుఃఖములకు, విచారములకు గురౌతాము.

## దృశ్యములన్నీ మనోభ్రాంతులే

దృశ్యములన్నీ కేవలము భ్రమల చేతనే సంభవిస్తున్నాయి. మీరు రైలులో ప్రయాణమైపోవుచున్నారు. రైలుపెట్టెల కిటికీలనుంచి చూచినప్పుడు కొండలు, గుట్టలు, చెట్లు, పరిగెత్తిపోయినట్లుగా కనిపిస్తున్నాయి. పరిగెత్తేది చెట్లు, కొండలు కాదు. పరిగెత్తేది మనమే. మన మానసిక చాంచల్యంచేతనే

సత్యస్వరూప ప్రతిబింబములను మనము గుర్తించలేక ప్రకృతిమార్పులుగా భావిస్తున్నాము. "నేను.... నేను" అనే మార్పుచెందని సత్యం ఎక్కడనుంచి వచ్చింది? నేను అనేది పుట్టిన తరువాతనే ఈ సృష్టి అంతయూ పుట్టింది. నేను లేనిదే సృష్టి కలుగదు. ఈ విధమైన విచారణ చెయ్యాలి. ఆత్మతత్త్వము సామాన్యముగా అర్థము కాదు. ఆత్మలేనిదే జగత్తులేదు. ఉన్నదంతా అదే అని తెలిసినప్పటికీ, లేనిదేదో ఒకటి ఉన్నదని భ్రమిస్తున్నాము. ఆత్మానుగ్రహమే లేకపోతే సర్వమూ వ్యర్థమైపోతాయి. ఎంత బలమున్నా, ఎంత సిరిసంపదలున్నా అన్నియూ వ్యర్థములే. మనకు ఆత్మజ్ఞానము లభ్యం కావాలనుకొన్నప్పుడు దివ్యమైన ఏకత్వమును అభివృద్ధిపరచుకోవాలి ఈనాడు అట్టి ఏకత్వమును కోల్పోవుటచేతనే, భిన్నత్వము అభివృద్ధి అయిపోయి ద్వేషము అధికమైపోతున్నది. దీని వలన దేశము అల్లకల్లోలమైపోతున్నది. జ్ఞానమును భిన్నత్వముగాని, విభాగముగాని చేయుటకు వీలుకాదు. ఈ దివ్యజ్ఞానము మనమే. మనలో ఉన్నదనిగాని, మనము సంపాదించేదనిగాని భావించరాదు. మనమే జ్ఞానము, అనంతము, సత్యము, బ్రహ్మము. దీనిని పురస్కరించుకొని— "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అన్నారు.

## వర్తమానమునందే గతము, భవిష్యత్తు

ఈ జగన్నాటకములో మనము ధరించిన వేషమును ఆధారముగా చేసుకొని, ఆ వేషమునకు తగిన చరిత్రను ప్రకటన చేస్తున్నాము. ఈ నాటకమునకు ఈ నటన (Action), ఈ మాటలు (డైలాగులు) సరిపోవచ్చునేమోకాని, నిత్య సత్యమైన జీవితమునకు ఏమాత్రము సమన్వయము కావు. ప్రస్తుతాన్ని నీవు తెలుసుకోవాలనుకొంటే వర్తమానాన్ని, వర్తమానాన్ని తెలుసుకోవాలనుకొంటే గతాన్ని చింతించాలి. నా ఉద్దేశ్యం భవిష్యత్తు, గతం రెండూ వర్తమానమునందే ఉంటున్నవి. కానీ ఇది Present...present అని మనము భావిస్తున్నాము. అదే పెద్దపొరపాటు. This is not present, this is Omnipresent. గతము, భవిష్యత్తు రెండూ మన వర్తమానమునందే ఉంటున్నవి. కాబట్టి భగవంతుడు ఎప్పుడూ Omnipresent అన్నారు. భగవంతుని నిజముగా అన్ని వేళలయందు, అన్ని కాలములందు ఉంటుండే దివ్యశక్తి. ఈలాంటి దివ్యమైన భావాన్ని మనము అర్థము చేసుకోవటానికి మన ఇంద్రియములు, మనస్సు, బుద్ధులను సరియైన స్థితిలో ఉంచుకోవాలి.

## నిజమైనభక్తి - దైవప్రేమ

మానవుడు ఆత్మతత్త్వము గుర్తించే నిమిత్తమై తగిన కృషి చేయుట లేదు. భౌతికమైన సుఖ, సంతోష, భోగ, భాగ్యముల నిమిత్తమై అనేక విధములుగా తాను శ్రమ పడుతున్నాడు. మనము చేసే ఇతర పరిశ్రమలలో వెయ్యింట ఒక భాగమో, కోటింట ఒక భాగమో మనము భగవంతుని చింతిస్తే, ఆ దివ్యత్వమును ఎంత ఆనందముగా అనుభవింపవచ్చు!

ధన, ధాన్య, భోగ, యశస్సుల నిమిత్తమై మనమెంత కాలమును వినియోగిస్తున్నాము? పుత్ర, మిత్ర, ఆభరణ, వ్యాపారములకై ఎంత కాలమును దుర్వినియోగపరచుకొంటున్నామో; ఆ కాలములో క్షణకాలము భగవంతుని పాదారవిందములపై మనస్సు పెట్టి భగవంతుని గూర్చి చింతిస్తే స్వర్గద్వారాలు తెరుచుకొని స్వాగతమిస్తాయి. మనం ఈ ఆత్మజ్ఞానమును, ఆత్మానందమును పొందవలెనంటే దీనికొక్కటే ఆధారము. అదే "భక్తి". స్వస్వరూపానుసంధానమే నిజమైన భక్తి. ఇదే నిజమైన ఆత్మనిష్ఠ. జ్ఞానమన్నా, భక్తిఅన్నా వేరు కాదు. భక్తే జ్ఞానము, జ్ఞానమే భక్తి. ఈ రెండూ అన్యోన్యాశ్రయములు. ఈ రెండింటినీ కట్టివేసే ప్రధానమైన సూత్రము ప్రేమ. ఈ ప్రేమ సూత్రము చేతనే భగవంతుని బంధింపవచ్చును. ప్రేమ ప్రత్యేకము కాదు. భక్తిఅనగా కేవలము జపములు చేయుటయో, ధ్యానములు చేయుటయో, పూజలు

చేయుటయో, యాత్రలు చేయుటయో, ఇంకేవిధమైన సత్కర్మలాచరించుటయో కాదు. ఇవన్నియూ కేవలం భక్తి అనే పేరుతో మనము అనుభవించే చిహ్నములు. స్వస్వరూపానుసంధానంపై మనస్సును తిష్టవేయించడమే నిజమైన భక్తి. దేహముతో ఏర్పడే ప్రేమ, వాంఛలతో ఏర్పడిన ప్రేమ క్షణభంగురమైనది. దైవప్రేమ శాశ్వతమైనది. కనుకనే "Love is God. Live in Love". ప్రేమ యందే నీవు జీవించాలి. ఎన్ని బాధలు కలిగినప్పటికీ, భౌతికమైన అనేక చిక్కులు కలిగినప్పటికీ, ఇవన్నీ కదలిపోయే మేఘములే. సత్య, నిత్యమైన ఆత్మతత్త్వాన్ని పొందేనిమిత్తమై మనము తగిన విచారణ చేయాలి. తమని తాము ఉద్ధరించుకోవాలి. "ఉద్ధరేదాత్మ నాత్మానమ్" అన్నారు.

## తుంగభద్ర

వేదాంతమ నందు మానవ శరీరమునకు "తుంగభద్ర" అని ఒక పేరు పెట్టారు. "తుంగభద్ర" అని ఒక నది కూడా ఉంటున్నది. తుంగ, భద్ర రెండూ చేరుటచేతనే— తుంగభద్ర అని పేరు వచ్చినది. "భద్ర" అనగా మంచి, పవిత్రము, కళ్యాణము, శోభ అనే అర్థములు ఉంటున్నాయి. "తుంగ" అనగా చాలా బలమైన, గొప్పవిశాలమైన అని ఈ విధమైన అర్థములు తీసుకొనవచ్చు. మంచి కార్యములు చేసేది. గొప్ప కార్యములు ఆచరించేది, కళ్యాణ కార్యములలో ప్రవేశించేది. దివ్యమైన ఆదర్శములందించేది ఈ దేహము. కనుకనే దీనికి "తుంగభద్ర" అని పేరు వచ్చినది. దీనికి ఇంత గొప్పపేరు పెట్టుకొని ఏవిధముగా ప్రవర్తిస్తున్నాము? పేరు మాత్రము గొప్పదేకాని ప్రవర్తన చాలా అల్పముగా ఉంటున్నది. మనం పేరుకు తగినట్లుగా ప్రవర్తించాలి. ఒక చిన్న ఉదాహరణ: త్యాగరాజునకు త్యాగరాజని పేరు పెట్టినందులకు నిజముగా అతని పేరునకు తగిన త్యాగము ఉంది.

## వేదము అపౌరుషేయము

ఆత్మతత్త్వమునకు లౌకికమైన ప్రమాణములన్నీ స్వీకరించాము. వీనినే తిరిగి వేదముతో సమన్వయిస్తాము. భారతీయులకు అనాది కాలము నుండి అన్ని విధముల ఆదేశములను అందిస్తున్నది వేదము. ఇది ఏ వ్యక్తులవలన ఆవిర్భవించినది కాదు. లేక పండితులచే లిఖింపబడినది కాదు. వేదము అపౌరుషేయమైనది. వేదము సాక్షాత్తు శబ్దమునుండి ఆవిర్భవించినది. ఒక్కొక్క వన్నము నందు 33 కోట్ల అక్షరాలు ఉంటున్నాయి. ఇన్ని విధములైన అక్షరములు ఏవిధముగా అభివృద్ధి అయినాయి? ఉన్నవి కొన్ని అక్షరములే. ఇవి అష్టాక్షరములు. ఈ అష్టాక్షరములే అనేకమైన అక్షరములుగా రూపొందినవి.

ఆంగ్లమున అక్షరాలు 26 ఉంటున్నాయి. ఆ 26 అక్షరాలలోనే పెద్దపెద్ద పుస్తకాలు వ్రాస్తూ ఉంటారు. ఈ అక్షరాలను వదలి ఇంకొకటి వ్రాయడానికి వీలు లేదు. నాలుగు తీగలు ఉండిన వయోలిన్‌ను ఉపయోగించి నన్నూరు రాగములంతా పాడవచ్చు. సారస్వతుడనే వాడు "అ-క-చ-ట-త-ప-య-శ" అనే ఎనిమిది అక్షరాలు విన్నాడు. ఈ ఎనిమిది అక్షరాలే అష్టదిక్కులా వ్యాపించి సర్వైశ్వర్యములను అందులో ఇమిడ్చి జగత్తునకు అందించినవి. వినికిడి చేత లభించినది కనుకనే దీనికి 'శృతి' అని పేరు వచ్చినది. ఈ శృతి ద్వారా కనుగొన్న సత్యాన్ని మానవుడు ఆచరించి తరించవలెను.

మీరు విన్నవి, కన్నవి ఏఒక్కటి రెండైనా ఆచరణలో పెట్టి, మీ జీవితమును లోకానికి ఆదర్శవంతంగా అందించండి.

—శ్రీవాణి దివ్యబోధ
తేది 30—మే—1
బృందావనం.



# స్వాతంత్ర్యం - ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం

ఓ మానవుడా !

" జీవితమంటే నిలకడలేని తామరాకుపైన తళతళలాడే నీటిబొట్టువంటిది. బ్రతుకు అంటే అభిమానపు పొరలగృహము. లోకమంటే దిగులు, దుఃఖములతో కూడినతెర. అందుచేతనే హరిగోవిందా! హరిగోవిందా! హరిగోవిందా! అని నీ కాలంగడుపుము".

విద్యార్థులారా! విద్యార్థినులారా!

ఆధ్యాత్మికమంటే, వ్యక్తిగతమైన స్వాతంత్ర్యమంటే ఏమిటో అంత సులభముగా అర్థము కాదు. ఈ రెండింటి యథార్థస్వరూపాన్ని సామాన్య మానవులు గుర్తించటం అంత సులభ సాధ్యం కాదు. ఆధ్యాత్మికమనగా ఒంటరితనమని, ఏకాకి జీవితమని భావించరాదు. యావన్మానవులలో ప్రేమబీజములు నాటి, కాంతిప్రసూనములు వికసింపజేసి పవిత్రమైన ప్రేమను ప్రజ్వలకందించటమే ఈ ఆధ్యాత్మికము యొక్క అంతరార్థము. ఇందులో ప్రత్యేకమైన దివ్యత్వమునే మనం విచారించినప్పుడు ఇక్కడ ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమని గాని, వ్యక్తిగతమైన స్వాతంత్ర్యమని గాని లేదు.

## స్వాతంత్ర్యమనగా ఏమిటి ?

" స్వాతంత్ర్యమన్నది ఈ జగత్తునందు ఎవ్వరికీ లేదు ". కానీ, రాజకీయంగా స్వాతంత్ర్యమని ఒక పేరు వచ్చింది. స్వాతంత్ర్యమనగా ఏమిటి ? విదేశీయుల పరిపాలన నుండి ముక్తులై స్వదేశీయుల పరిపాలనను స్వీకరించటము స్వాతంత్ర్యమని భావించరాదు. ఇది వ్యక్తిగతమైన స్వాతంత్ర్యం కాదు. ప్రాథమిక స్వాతంత్ర్యమూ కాదు. కేవలం అహంకారతత్త్వమును ప్రకటించే నిమిత్తమై ఆచరించే కొన్నిచర్యలు మాత్రమే. విదేశీయులు పోయిన తరువాత స్వదేశీయులు స్వాతంత్ర్యమును పొందినారనుకొంటున్నాము. ఎందులో స్వాతంత్ర్యమును పొందాము ? స్వాతంత్ర్యము...... స్వాతంత్ర్యము అన్నంతమాత్రమున ప్రయోజనము లేదు. ఐక్యతను సాధించినప్పుడే స్వాతంత్ర్యము ప్రయోజనమౌతుంది. ఐక్యతను సాధించక స్వాతంత్ర్యమనుకొంటే, ఇది కేవలము

మాటల స్వాతంత్ర్యమేగాని నిజమైన స్వాతంత్ర్యము కాదు. స్వాతంత్ర్యమనేది హృదయ స్థాయి నుండి ఏర్పడాలి.

హృదయమంటే ఏమిటి ? రక్త మాంసములతో కూడిన గుండెకాయ కాదు. హృదయము అనగా ఒక స్థానమునకుగాని, కాలమునకుగాని, వ్యక్తికి గాని, దేశమునకుగాని సంబంధించినది కాదు. సర్వత్రా, సర్వకాలముల యందు, సర్వదేశముల యందు, సర్వ వ్యక్తుల యందు— సమత్వంగా ఉండే దివ్యత్వమే హృదయము. ఈ హృదయమునకు రూపము లేదు. మానవుని దేహము నందు దేనిని మనము హృదయముగా భావిస్తున్నామో, అది మధ్యలోవచ్చి మధ్యలో పోయేది. దేనిని గుర్తిస్తే సర్వమునూ గుర్తించిన వాడౌతాడో, అలాంటి దివ్య తత్త్వమును గుర్తించడమే నిజమైన స్వాతంత్ర్యము. "యథాండాండే తథా బ్రహ్మాండే" అన్నారు. అండాండము వ్యష్టి గతము. బ్రహ్మాండము సమిష్టి స్వరూపము.

## తానంటే ఎవరు ?

'తనను తాను గుర్తించుకొన్న వ్యక్తి సర్వమును గుర్తించగలడు'. తానంటే ఎవరు? ఈనాటి మానవుడు ప్రపంచములో సర్వమునూ తెలుసుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. సమస్తమూ తెలియునని విఱ్ఱవీగుచున్నాడు. ఒకవేళ తెలియకపోతే తెలుసుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. తానెవరో? తన తత్త్వమేమిటో ? తాను తెలుసుకోకుండా, సర్వమూ తెలుసుకొనుటకై ప్రయత్నిస్తున్నాడు. ఒక చిన్న ఉదాహరణ. ఉపనిషత్తునందు ఉద్దాలకుడనే మహాపండితుడు తన కుమారుడైన శ్వేతకేతువును ఇంకొక గురువు దగ్గరకు విద్యాభ్యాస నిమిత్తం పంపినాడు. పన్నెండు సంవత్సరములలో సమస్త విద్యలు గ్రహించినాడు. అన్ని విద్యలు తెలుసుకొన్నానని విఱ్ఱవీగి వెఱ్ఱివాడై తనయొక్క తండ్రి దగ్గరకు వచ్చి, "నాన్నా ! నేను సకల విద్యలూ నేర్చుకొన్నాను" అని అన్నాడు. అప్పుడు తండ్రి ప్రశ్నించాడు, "నాయనా! ఏమి తెలిసిన సర్వమునూ తెలిసినట్లవుతుందో, దానిని నీవేమైనా చదువుకొన్నావా?" అని అన్నాడు. శ్వేతకేతుడు అహంకారమునుండి కొంత క్రిందికిది గినాడు. అన్నింటికంటే విద్యాహంకారము చాలా వెఱ్ఱితలలు వేస్తుంది. అప్పుడు తన కుమారుడైన శ్వేతకేతువునకు లోకజ్ఞానమున కంటే "ఆత్మజ్ఞానం, బ్రహ్మజ్ఞానం" అత్యవసరమని తండ్రియైన ఉద్దాలకుడు బోధించినాడు.

## మనస్సు - స్వాతంత్ర్యము

జగత్తునందు "ఏకంసత్" ఉన్నది ఒక్కటే. రెండవది ఉంటే కదా స్వాతంత్ర్యమో (ఫ్రీడమో), బంధమో అనేది కనిపిస్తుంది. ఈ బంధము, స్వాతంత్ర్యము అనేవి మనఃకల్పితాలు. సూర్యుడు లేనప్పుడే చంద్రునకు మనము విలువనిస్తున్నాము. సూర్యుడు ఉండినప్పుడు చంద్రుని ఎవ్వరూ చూడరు. సూర్యుడు లేనప్పుడు చంద్రునికి దేనివల్ల విలువనిస్తున్నాము? చంద్రునకు స్వతఃప్రకాశము లేదు. సూర్యకిరణములు చంద్రుని మీదపడినప్పుడే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అదే విధముగనే ఆత్మాన్వేషణలేని సమయమునందే మనము చంద్రుడనే మనస్సునకు విలువ ఇస్తున్నాము. "చంద్రమా మనసోజాతః, చక్షోస్సూర్యో అజాయత" ఈ మనస్సునకు, చంద్రునకు ఉండిన బింబప్రతిబింబముల సంబంధమును వేదము పైరీతిగా వర్ణించి, నిర్ణయించినది. కాబట్టి ఆత్మ విచారము లేనంతవరకూ మనస్సునకే ఎక్కువ బలమును, సమయమును, ప్రాధాన్యమును ఇస్తున్నాము. ఈ మనస్సనేదే స్వతస్సిద్ధమైన ప్రకాశం కాదు. మనస్సుండినవానికే స్వాతంత్ర్యం, బంధన. మనస్సుండిన వానికే ఆధ్యాత్మికము, పారమార్థికము, లౌకికము. మనస్సుండినవానికే ప్రకృతి, పరతత్త్వము. మనస్సుండినవానికే స్త్రీ, పురుషుడు అనే భేదము. సర్వద్వంద్వములు ఈ మనస్సు వల్లనే ఏర్పడినవి.

## ఈనాడు స్వాతంత్ర్యము రెండు రకములు

ఈనాడు లోకములో స్వాతంత్ర్యము అనేది రెండు రకములుగా ఉంటున్నది. ప్రభుత్వస్థాయిలో ఇది ఈ రీతిగా చేయాలి - ఇది ఈ రీతిగా చేయాలని, కొన్ని నిబంధనలచేత కొన్ని స్వాతంత్ర్యములను అనుభవిస్తున్నాము. దీనిని స్వాతంత్ర్యమని చెప్పటానికివీలులేదు. ఇక్కడంతా కేవలం ఒక Rules and Regulations ఉంటాయి. వ్యక్తిగతమైన దానిని విచారణచేస్తే, ఇదికూడను స్వాతంత్ర్యం కాదు. ఇది కేవలము మానవుని సంకల్ప ప్రభావము. ఇది తన మనోభీష్టములను నెరవేర్చుకొనే నిమిత్తమై అనుసరించే స్వార్థము. అందులో కూడా స్వాతంత్ర్యము లేదు. ఒకడు చాల బీదవాడుగా ఉంటాడు. అతనికి అన్నము కావాలి. ఎవరిని అడిగినా పెటరు. తన ఆకలిని తీర్చుకొనే నిమిత్తమై దొంగతనంచేస్తాడు. తనకది Freedom అంటాడు. తన స్వార్థమును పురస్కరించుకొని ఈ రీతిగా దొంగతనం చేయవచ్చునని అనుకొంటున్నాడేకాని, అతని Conscience మాత్రం ఒప్పుకోవటం లేదు. అతని Conscience ఒప్పనప్పుడు ఇది స్వాతంత్ర్యము ఎట్లా అవుతుంది? ఇది ఒక బంధనతో కూడిన స్వాంతత్ర్యమనే చెప్పాలి. నిజమైన స్వాతంత్ర్యము ఎప్పుడు వస్తుంది? మనస్సనే దానిని నిర్మూలనము గావించినప్పుడే నిజమైన స్వాతంత్ర్యము వస్తుంది.

స్వ + భావము అది స్వభావము. స్వ + ఇచ్ఛ = స్వేచ్ఛ. 'స్వ' అనగా ఆత్మ కనుక, ఆత్మ ఇచ్ఛయే స్వాతంత్ర్యము. అదే స్వేచ్ఛ. అంతే కాని, దేహేంద్రియ, మనో బుద్ధులతో ఆచరించే కర్మలన్నియూ స్వాతంత్ర్యములు కావు. Law of Nature ప్రకృతిని అనుసరించి మనము ఆచరిస్తూనే ఉంటాము. ఇది స్వాతంత్ర్యము కాదు. Law of Nature ఒకటి, Rules and Regulations మరొకటి ఈ రెండింటి మధ్యలోనే మానవ జీవితము సాగుచున్నది. ఎవరికివారు, "నేను స్వతంత్రుడను .. నేను స్వతంత్రుడను" అని అనుకోవడానికి వీలుకాదు. "దివ్యత్వము ఒక్కటి మాత్రమే స్వతంత్రము". దీనిని స్వాతంత్ర్యమని చెప్పటానికి వీలు లేదు. ఉన్నది ఒక్కటే కనుక ఆ పదమునకు అక్కడ స్థానమే లేదు.

## ఇష్టము - స్వాతంత్ర్యము

మానవ జీవితములో మనం దేనిని పొందాలని ఆశిస్తామో, పొందేదాని నిమిత్తమై ఏ విధమైన దానిని మనము అనుసరిస్తామో, ఈ విధమైన భావములన్నీ కేవలము మానసిక వికారములే. మనస్సు ఉండినంత వరకూ స్వాతంత్ర్యము ఎవ్వరికీ లేదు. ప్రాకృతమైన మార్గములో ఇది నా స్వాతంత్ర్యము, నా ధనము నేను అతనికి ఇస్తున్నాను ఇది నా స్వాతంత్ర్యము అని అనుకోవచ్చు. ఇది స్వాతంత్ర్యము కాదు. అది స్వేచ్ఛ కాదు. మనోభావములో ఏర్పడిన కొన్ని సాత్విక గుణములు. మనస్సు అన్ని గుణముల మిశ్రమమై ఉంటుంది. ఒక్కొక్క సమయములో ఒక్కొక్క గుణము అభివృద్ధి అవుతుంది. అతనికి నేను ఒక రూపాయి ఇవ్వాలని సంకల్పించుకొంటాను. దానికి ఎవ్వరి అంగీకారము అక్కరలేదు. నా స్వాతంత్ర్యము అంటాము. ఇదంతా స్వాతంత్ర్యమునకు సంబంధించినది కాదు. వాని పరిస్థితిని, వాని ప్రార్థనమూ మనస్సు అంగీకరించి నీవు ఇచ్చేది దానమేకాని అది నిజమైన స్వాతంత్ర్యము కాదు. సృష్టిలో మానవునియందు స్వేచ్ఛ అనేది ఉండటానికి వీలే లేదు. ఇష్టమునకు స్వాతంత్ర్యమునకు చాలా వ్యత్యాసము ఉంటుంది. ఇష్టమును వస్తువును బట్టి, స్వార్థమును బట్టి వినియోగించుకొనవచ్చును. ఏవస్తువైనాకాని, ఏస్థానమునందైనాకాని, ఏవ్యక్తియందైనా కాని తన హృదయభావము నుండి వచ్చినదే నిజమైన స్వాతంత్ర్యం. ఇది హృదయంనుండి ఆవిర్భవించాలి.

## సర్వము నీయందే ఉంటుంది

మానవ జీవితములో ఉన్నత స్థాయిని పొందిన వ్యక్తులలో మేథాశక్తులు ఎక్కడ నుండియో వచ్చినవి కావు. అన్నీ తననుండి ఆవిర్భవించినవే. "నేను చాలా బలవంతుడను" అని అనుకొంటాను. నేను కొన్ని సాధనలచేత సాధించినాననుకొంటాను. ఎవరు ఏది సాధించినప్పటికీ, ఒకరివల్ల ఒకరు సాధించినాననుకోవటం అజ్ఞానము. సర్వమూ నీయందే కలదు. నీయందుండిన దానిని నీవు బహిర్గతము గావించుకోవటమే నీవు చేసే ప్రయత్నం. ఉన్నది ఒక్కటే అయినప్పుడు దానిని పొందటానికి వేరే సాధనలు ఎందుకు? మనస్సు తత్త్వము నుండి అవిద్యాభావము దూరము గావించుకొనుటయే మనము చేయవలసిన సాధన. ఈ మానసిక వృత్తులను అరికట్టుకోవటమే సాధన. అదృష్టముకాని, దురదృష్టము కాని, ఆనందముకాని, దుఃఖముకాని ఇవన్నియు మనయందే ఉన్నవి. ఒక బావి త్రవ్వినాము. ఈ బావి నూరు అడుగులు త్రవ్వేటప్పటికి నీరు వచ్చింది. ఆ నీరును నీవు తెప్పించినావా? నీరు అక్కడ ఉండనే ఉన్నది. మధ్యనున్న మట్టిని తీసివేయుటవలన నీరు కనిపించింది. అంతేకాని నీవు ఆ నీటిని క్రొత్తగా సృష్టించలేదు. అదే విధంగా నీలో నున్న దివ్యశక్తిని మరచినావు. నీవు మరవడానికి కారణము ఏమిటి? దేహతాదాత్మ్యమును పొందుటవలన దివ్యభావాన్ని నీవు మరచిపోయినావు.

ప్రతి ఒక్కటి దివ్యత్వముకాని, పవిత్రత కాని, అపవిత్రతకాని, దుఃఖముకాని, ఆనందము కాని మనలో ఉండినట్టివే. ఇది నీకు స్వాతంత్ర్యము కాదు. ఉన్నది అదే. ఇది స్వేచ్ఛ అనుకొంటే, ఇది స్వేచ్ఛ కాదు. కర్తృత్వము కనుక, Free will అని చెప్పటంలో దీనికి అర్థంలేదు. Free will అనేది ఒక్కటే. అదే హృదయస్థాయి. అది ఎప్పటికి ఉన్నది. ఒక తూరివచ్చి, ఒకతూరిపోయేది కాదు. మనోభావము ఉండినంతవరకూ మానవులకు భిన్న భావములు అభివృద్ధి పొందుతూ ఉంటాయి. ఇవి మనస్సు యొక్క స్వాతంత్ర్యములేకాని, మనిషి యొక్క స్వాతంత్ర్యములు కావు.

## సంబంధము - నిర్బంధము - కర్తవ్యము

కర్తవ్యమునకు, స్వాతంత్ర్యమునకు వ్యత్యాసము గలదు. ఇది మూడు రకములు. (1) సంబంధము. (2) నిర్బంధము. (3) కర్తవ్యము. దీనికొక ఉదాహరణ: ఒక ఆదివారము వచ్చింది. స్నేహితులనందరినీ పిలిచి 'టీపార్టీ' పెట్టాలనుకొన్నావు. 4 గంటలకు అన్ని ఏర్పాట్లు చేసుకొంటావు. నీకు తీవ్రముగా జ్వరము వస్తుంది. నీకు జ్వరము వచ్చినట్లు స్నేహితులకు ఫోన్ చేసి టీపార్టీ మానుకుంటానన్నావు. ఇది స్వాతంత్ర్యమనుకొంటున్నావు. ఇష్టమైతే పెట్టుకోవచ్చు, ఇష్టము లేకపోతే మానుకోవచ్చు. ఇది సంబంధమునకు చెందిన విషయము. ఇక నిర్బంధము; నీవు ఆఫీసులో ఉంటావు. అధికంగా జ్వరము వస్తుంది. ఆనాడే నీ Director నీ Officeను visit చేస్తున్నాడు. సెలవు తీసుకోవడానికి వీలు లేదు. Doctor దగ్గర ఇంజెక్షన్ తీసుకొని జ్వరముతోనే Officeకు పోతావు. ఇది నిర్బంధము. మూడవది కర్తవ్యము; ఏదో కొన్నికారణాలవల్ల భార్యా భర్తలు పోట్లాడుకొంటారు. కోపముచేత భర్త ఆమెను రెండు కొట్టాడు. ఆమె బెడ్‌రూంకుపోయి పడుకొంటుంది. ఇంక భర్త డ్రాయింగ్‌రూములో చాలా కోపంతో, ఆకలితో కూర్చుంటాడు. ఆకలివల్ల, కోపమువల్ల చాలా restlessగా ఉంటాడు.

అదే సమయములో ఒక స్నేహితుడు వస్తాడు. నవ్వుతూ ఆ స్నేహితునితో కొన్ని నిముషాలు గడిపి లోపలికిపోయి, "నా స్నేహితుడు వచ్చాడు. కాఫీ చేయి" అని కోపంతో అంటాడు. భార్యతోకోపంగా ఉన్నాడు. స్నేహితునితో ఆనందముగా ఉంటాడు. స్నేహితునితో ఆనందముగా ఉన్నది భార్యకు తెలియ

కూడదు. భార్యతో కోపంగా ఉన్నది స్నేహితునికి తెలియకూడదు. ఇట్టి పరిస్థితిని కర్తవ్యంగా గమనించ వలసి ఉంటుంది. ఈనాడు సంబంధము పోయింది, నిర్బంధము పోయింది, కర్తవ్యము అంతకంటే కనిపించుట లేదు. ఇదే ధర్మనాశనము, ధర్మగ్లాని. భార్యతో కొట్లాడిన వ్యక్తి డ్రాయింగ్ రూములో ఉన్నప్పుడు స్నేహితుడు వచ్చివుంటే, అతనిని Get-out అంటే, ఈ స్నేహితునికి పిచ్చిపట్టిందేమో అని అనుకొంటాడు. సమయస్ఫూర్తిగా మన భావములను గాని, మన చర్యలనుగాని మార్చుకొనే విధానమే కర్తవ్యము. కాబట్టి నిర్బంధ, సంబంధ, కర్తవ్యముల మూడింటి యందు మానవులకు స్వాతంత్ర్యము లేదు. సమాజ స్థితిగతులనుబట్టి మన ప్రవర్తనను మార్చుకొంటున్నాము. కనుక మనకు ఆత్మస్థాయియే నిజమైన స్వాతంత్ర్యము.

## ఆధ్యాత్మికము - స్వాతంత్ర్యము

ఆత్మభావమును లక్ష్యము నందుంచుకొని నీవు ఏకార్యమును చేసినా. నీవు తప్పక స్వాతంత్ర్యముగా ఉంటావు. వ్యక్తిగతమైన స్వాతంత్ర్యమనిగాని, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమనిగాని వేరు వేరుగాలేవు. ఆధ్యాత్మికమే స్వాతంత్ర్యము, స్వాతంత్ర్యమే ఆధ్యాత్మికము. ఇవి రెండూ వేరుగా ఉండటానికి వీలుకాదు. ఒకే పదార్థము భిన్నస్వరూపాలు ధరించింది. పాలు ఉన్నాయి. పాలను పెరుగు చేసుకొన్నాము. పెరుగును చిలికినాము వెన్నవచ్చింది. మజ్జిగ విలిచింది. పాలుగా ఉన్నది— పెరుగు కావటము, వెన్నగా కావటము, మజ్జిగగా కావటం ఇన్ని రూపాలు చెందింది. అయితే ఇన్ని రూపములలో ఉన్న పాలు ఒక్కటే. అదే విధముగనే సాలోక్యం, సారూప్యం, సామీప్యం, సాయుజ్యం- ఈ నాల్గు భిన్న భిన్నములుగా కనిపించినా నాల్గుచేరి ఒక్కటే. కాకపోతే ఒకదానికొకటి సోపానములు. సాలోక్యం: భగవచ్చింతన చేస్తున్నాము. భగవచ్చింతన చేస్తూచేస్తూ ఏమైపోతుంది? సామీప్యం, స్వామి చింతన చేస్తూ స్వామి దగ్గరగాపోవాలని ఆశపుడుతుంది. సామీప్యం పోయినతరువాత స్వామిలో ఐక్యంకావాలి, స్వామివలె ఉండాలని ఆశిస్తాము. సారూప్యం: పొందాలని ఆశించినతరువాత సాయుజ్యం కావాలని ఆశిస్తావు. ఇవన్నీ ఒక దాని-భిన్నస్వరూపములేకాని, వేరు వేరు కావు.

## నిజమైన స్వాతంత్ర్యము

మానవునకు ఈ భౌతిక జగత్తునందు స్వాతంత్ర్యము ఉన్నదంటే వెఱ్ఱిస్వాతంత్ర్యమని చెప్పవలె. దీనినే అహంకార, అభిమాన స్వాతంత్ర్యములనిచెప్ప వచ్చు. నా బిడ్డపైన నాకు స్వాతంత్ర్యముంటుంది. నా భార్యపైన నాకు స్వాతంత్ర్యము ఉంటుంది. కాబట్టి ఇద్దరినీ కొట్టవచ్చు, తిట్టవచ్చు అనుకొనుట నీ భ్రాంతియే కాని నీకు అధికారము లేదు. మంచిని చెప్పవచ్చు, బోధించవచ్చు. కొట్టుట, తిట్టుట స్వాతంత్రమనుకొనుట చాలా తెలివి తక్కువ. నాకు స్వాతంత్ర్యముంది అనుకొంటే, నీ ఇష్టము. నీకెంత స్వాతంత్ర్యమో, ఆమెకు అంత స్వాతంత్ర్యమే కదా! బయటివారి స్వాతంత్ర్యమును అణగద్రొక్కి నీ స్వాతంత్ర్యమును పెంచుకొనుట అది కేవలము నీ స్వార్థము. నిజమైన స్వాతంత్ర్యమంటే, బయటివారి స్వాతంత్ర్యమునకు అడ్డుతగలకపోవుటయే.

నిజముగా విచారించినప్పుడు లోకములో ఎవ్వరికినీ స్వాతంత్ర్యము లేదు. నిత్యజీవితములో వ్యక్తిగతమైన స్వాతంత్ర్యమని, Fundamental Law అని రెండింటిని అనుసరిస్తున్నాము. ఇవి జీవనోపాధి నిమిత్తమై ఆచరించే చర్యలు. ఇవి ఉండవలసినవే. ఎవ్వరూ కాదని విసర్జించటానికి వీలులేదు. ఒక స్త్రీ నడిరోడ్డుమీద నడుస్తూ ఇది నా స్వాతంత్ర్యమనుకొంటుంది. అది స్వాతంత్ర్యము కాదు. అది ప్రభుత్వమువారి నిర్ణయానికి విరుద్ధముగా జరిగినట్లు అవుతుంది. విరుద్ధముగా జరిగినప్పుడు ప్రభుత్వమైనా

శిక్షిస్తుంది, లేదా ఏలారీయైనా కొట్టి Punishment ఇస్తుంది. తత్ఫలితమును అనుభవించవలసి వస్తుంది. కాబట్టి కర్తృత్వ, భోక్తృత్వ ఫలితములను మనం అనుభవించవలసి వస్తుంది.

## రెండూ నీ ప్రతిబింబములే

మానవులకు స్వాతంత్ర్యమనే పదమునకు అర్థము ఎవ్వరికినీ తెలియదు. స్వాతంత్ర్యముండిన మానవుడు జగత్తునకేరాడు. వానికి జన్మ యే లేదు. ఎప్పుడు ఈ దేహమును ధరించి ఈ జగత్తునకు వచ్చాడో, అప్పుడే వానికి స్వాతంత్ర్యము లేదు. మన స్వాతంత్ర్యమనేది హద్దులతో కూడినదిగా ఉండాలి. ఇట్టిదానిని కూడా స్వాతంత్ర్యమని చెప్పకూడదు. ఇట్టిదానిని నిబంధన అని చెప్పవలెను. ఈనాడు పదములయొక్క అర్థాన్ని సరిగా తెలుసుకొనలేకపోతున్నాము. నిజంగా హృదయమనేదానికి సరియైన అర్థమే తెలుసుకొంటే, దీనికి ఏదో ఒక హద్దులో పెట్టడానికి వీలుకాదు. నీలో ఏ హృదయముందో, అదే ఎదుటివానియందు ఉన్నది. నీ ద్వేషియందుకూడా అదే హృదయముంది. సర్వుల యందు ఒకే హృదయమే ఉంటుంది. సర్వులయందు ఒకే హృదయముండినప్పుడు, సర్వుల భావములూ ఒక్కటిగానే రావాలి. ఈ భావములు మనఃకల్పితములు. ఈ భేదము, ఈ భావములు, ఈ చర్చలు అన్నీ మనస్సుతో వచ్చినవేకాని, హృదయముతో వచ్చేవి కావు.

హృదయములో ఎట్టి భేదమూ లేదు. ఈ భేదములన్నీ నీ మానసిక ప్రతిబింబములే. ఒకరిని ద్వేషిస్తున్నావంటే, అది నీ ప్రతిబింబమే. ఒకరిని ప్రేమిస్తున్నావంటే, ఒకరిని హాస్యము చేస్తున్నావంటే, రెండూ నీ ప్రతిబింబములే. కాబట్టి నీ Reaction, Resound, Reflection ఈ జగత్తునందు స్వరూప, స్వభావములుగా కన్పిస్తున్నాయి. ఈ Reaction. Resound, Reflection ను విసర్జించి Reality అనే హృదయాన్ని మనము పట్టుకొంటే ఈ భేదములెంత మాత్రము కలుగవు.

## నీవే నేను - నేనే నీవు

కృష్ణుడు మా యాదవ కులములో పుట్టినాడు, సాయిబాబా మా క్షత్రియ వంశములో పుట్టినాడు. అని అనుకొనుట సంకుచిత భావమును తెలియజేస్తుంది. భగవంతునికి మాత్రము ఇట్టిభేదములు ఏనాడూ లేవు, ఎప్పుడూరావు. దివ్యత్వమైన ఆత్మతత్త్వమును అర్థము చేసుకుంటే సంకుచితమైన మార్గమునకు ఏమాత్రము అవకాశము కలుగదు. ఇవన్నీ సంకుచితమైన తత్త్వములు, స్వభావములు. విశాల భావములు పెంచుకొని విశాలమైన ఆత్మతత్త్వమును అర్థము చేసుకోవాలి.

ఆధ్యాత్మికమును సంకుచితమైన స్థాయిలో విచారించరాదు. పూజలు, భజనలు, ధ్యానము ఇవన్నీ ఆధ్యాత్మికమునకు చిహ్నములుగా భావిస్తున్నాము. ఇవన్నియూ మన మానసిక వికారములే. మన తృప్తి నిమిత్తమై ఆచరించే క్రియాకలాపములే. దేవుడే దైవము, తల్లి, తండ్రి, స్నేహితుడు ఈ విధమైన భావాలు ఎందుకు? అంతేకాకుండా భగవంతుడే మాకు మాత, పిత, స్నేహితుడు అని రకరకాలుగా వర్ణించుట కంటే, " నీవే నేను - నేనే నీవు " అనుకుంటే సరిపోతుంది. దైవంతో ఏకము కావటమే ఆధ్యాత్మికము. దైవము నీవు వేరుకాదు. నీవే దైవము, దైవమే నీవు. కొంతమంది నీవు, నేను ఒక్కటే అని పలుకుతారు కాని ఆచరణలో శూన్యము. తల్లి, తండ్రి- ఈ భావములే మనకు అక్కరలేదు. ఈ భౌతికసంబంధము ఏమాత్రము అభివృద్ధి పరచుకోరాదు. " నీవే నేను నేనే నీవు " ఈ రకమైన సంబంధము అభివృద్ధి పరచుకొంటే ఎట్టి భేదములకు అవకాశము ఉండదు. ఇదే నిజమైన స్వేచ్ఛ.

# ఒక వైపుపూజిస్తారు-మరొక వైపుదూషిస్తారు

విద్యార్థులారా !

దివ్యత్వమునకు మార్పు ఉండదు. ఈ విషయము మీకు తెలియకపోవచ్చు. మీరు నమ్మినా, నమ్మకపోయినా దుఃఖమంటే నాకేమిటో తెలియదు. అట్లే విచారమంటే, కష్టమంటే నాకు తెలియదు. నిందా విషూరములు చేస్తున్నారంటే, ఆ బాధ ఏమిటో నాకు తెలియదు. అది వారి ఇష్టము. పూజచేయుట నీ ఇష్టము. ఎవరి ఇష్టము వారిది. దీనికెందుకు బాధ పడాలి? గట్టిగా తిడితే గాలిలో పోతుంది. తనలో తాను తిట్టుకుంటే తనకే తగులుతుంది. ఆ తిట్టు నా వరకు రాదు. మరి నేనెందుకు బాధపడాలి? సత్యమైన తత్త్వాన్ని గుర్తించుకొంటే విచారములు ఏమాత్రము ఉండవు. అనేకమంది అనేకరకములైన భావములతో ఉంటారు. ఒకవైపున పూజించేవారు, మరొకవైపున దూషించేవారు ఉంటారు. ఇది ఒక పర్వతము, అది ఒక పర్వతము. ఈ పర్వతముల రెండింటి క్రింద గుంతలుంటాయి. ఒక దగ్గర మట్టి గుట్టకావాలంటే, క్రింద గుంత ఉండాలి కదా! ఈ గుంతమట్టే గుట్టమట్టి, గుట్టమట్టే గుంతమట్టి రెండూ సమానమే. ఈ రకమైన తత్త్వమే నిజమైన ఆత్మ తత్త్వము.

ఒక్కొక్కరి భావములను, ఒక్కొక్కరి చర్యలను, ఒక్కొక్కరి తలంపులను పురస్కరించుకొని వారికి తగిన మందు అందిస్తాను. ఎందుకంటే వారిని సరిచేసే నిమిత్తమై ఒక్కొక్కరితో నెలలకొద్ది నేను మాట్లాడను. ఇది వారిరోగమునకు తగినమందు. స్వామి ఎందుకు నాతో మాట్లాడటంలేదని అడిగే అధికారం ఎవ్వరికీలేదు. అది నా ఇష్టం. చేసేపనులనుబట్టి కొంచెం కోప్పడినట్లుగా చేస్తాను. ఆ కోపం బయట కోపమేకాని, లోపలినుండి వచ్చేది కాదు. ఒక్కొక్కరిని చూడనేచూడను, ఒక్కొక్కరితో మాట్లాడనే మాట్లాడను. ఒక్కొక్కరు ఇటువస్తే అటుపోతాను.

# నామాటకు నేను విలువ యిస్తాను

నాకు ఒక నియమం ఉంటుంది. నామాట చాలా విలువైనది. నా మాటకు మీరు విలువ ఇవ్వకపోయినా నేను నా మాటకు విలువ యిస్తాను. కనుక నా మాటను సరిగా నడుచుకోలేనప్పుడు నేను వారితో మాట్లాడి నామాట Waste చేయటం నాకిష్టముండదు. కాబట్టి నా విలువను నేను కాపాడుకొనే నిమిత్తమై, కొన్ని కారణాలను బట్టి మాట్లాడకుండా ఉంటాను. స్వామి నాతో మాట్లాడడం లేదని మీరు చెప్పుకుంటారు కాని, "నేను మాత్రము స్వామి ఆజ్ఞను నడచుకోలే"దని ఎందుకు భావించుకోరు? ఇది One Way Traffic కాదు. Give and Take. నీలో సమత్వముంటే రెండింటినీ విచారణ చెయ్యాలి. "ఈవిధంగా నేను చేయుటచేత, స్వామి నాతో మాట్లాడలే"దని నీవు గుర్తించుకుంటే ముమ్మందు ఇంక అట్టి పనులు చేయకుండా వుంటావు.

"స్వామి మాట్లాడటం లేదు" అనే చూస్తున్నారు కాని, "తాము చేసిన తప్పును గుర్తించటానికి ప్రయత్నించుటలేదు". కాబట్టి స్వామిని మాట్లాడమని కోరనక్కరలేదు. నీవు ఆ తప్పు చేయకుండా ఉంటే స్వామియే వచ్చి మాట్లాడుతాడు. ఆజ్ఞను శిరసావహించుకుంటే అనుగ్రహము అక్కడే లభిస్తుంది. మొట్టమొదట మీ మాటకు విలువను పెట్టుకోండి. దానిని సంపాదించుకోండి. రెండు కన్నులున్నాయి, రెండూ చూడవచ్చు మీరు, రెండు చెవులున్నాయి, రెండూ వినవచ్చు మీరు. కాని నాలుక ఒక్కటే ఉంది. కనుకనే, "మాటకు ప్రాణము సత్యము, కోటకు ప్రాణంబు సుభటకోటి ధరిత్రిన్, బోటికి ప్రాణము మానము, నోటుకు ప్రాణంబు వ్రాలు" అన్నారు. మన Signature లేకపోతే ప్రామిసరీ నోటుకు విలువ ఎక్కడ ఉంటుంది? మన మాటకు సత్యమే ప్రాణము. అప్పుడే సత్యమేవ జయతే.

## క్రుంగను — పొంగను

దైవ తత్త్వము అందరికీ అర్థమయ్యేదికాదు. దైవము దేనికీ క్రుంగదు, పొంగదు. ప్రపంచమంతా వచ్చి దూషించినా నేను క్రుంగను. ప్రపంచమంతా వచ్చి వర్ణించినా నేను పొంగను. "నా సత్యం నాది". క్రుంగి, పొంగేవారికి వారిలో ఉన్న దోషాలే reaction. దోషము లేనప్పుడు ఎందుకు క్రుంగాలి? ఎందుకు పొంగాలి? కాబట్టి హృదయస్థాయందుండినది ఒక్కటే. అదే పవిత్రము. ఆ విశ్వాసము మనము బలపరచుకొంటే ఏవిధమైన విచారములకు అవకాశము ఉండదు. స్వామి ఆధారతత్త్వాన్ని మీరు కొంతవరకు గుర్తించడానికి కృషిచేయ్యండి. కేవలము ఆధేయము మాత్రమే గుర్తించుటకు ప్రయత్నించనక్కర లేదు. ఆధేయము మార్పు చెందేది. ఆధారము మార్పు చెందనిది. అదే సత్యం, అదే నిత్యం, అదే ఆత్మ, అదే హృదయం, అదే నేను.

శ్రీవారి దివ్యబోధ
31—మే—1990
బృందావనం.



## చందాదారులకు విజ్ఞప్తి

(ఎ) వార్షిక చందా 20 రూపాయలు మనియార్డరు ద్వారా— కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం (పోస్టు), అనంతపురం జిల్లా, ఎ. పి. — 515 134 కు పంపవలెను.

(బి) వేరుగా ఎక్నాలెడ్జిమెంటు కోరువారు తమ చిరునామాగల రిప్లైకార్డు పంపవలెను.

(సి) చందాలు ఒక సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడగలవు.

(డి) చందాదారు పూర్తిపేరు, చిరునామా మనియార్డరు కూపను (సమాచార్ అనుభాగ) పైననే స్పష్టముగా పెద్ద అక్షరాలతో వ్రాసి పంపవలెను.

(ఇ) మనియార్డరు కూపనుపైన, పత్రిక (ఇంగ్లీషు / తెలుగు) ఏ భాషలో కావలెనో స్పష్టముగా పేర్కొనవలెను.

(ఎఫ్) చందాల రెన్యూవల్ కోరునప్పుడు, ప్రస్తుత చందాసంఖ్యను పేర్కొంటూ, రెండునెలలు ముందుగా పంపవలెను.

(జి) క్రొత్తగాచందాలు కట్టినవారికి చందా స్వీకరించిన రెండుమాసాల తర్వాత నుండి పత్రిక పంపగలం.

గురుదేవ వాణి :

# దేశాభిమానం : దైవాభిమానం

"మానవుడు పుట్టినప్పుడు తానేమి గొనితెచ్చె! గిట్టినప్పుడు తానేమి గొనిపోవు! తానెచటికి పోవునో, ధనమెచటికి పోవునో- ఎవ్వరూ చెప్పలేరు".

విద్యార్థులారా! విద్యార్థినులారా!

మనము జీవించు లోకము స్థిరమైనది కాదు. యవ్వనము మధ్యలో వచ్చి మధ్యలో పోవునది. ఇట్టి యవ్వనమునకు మిడిసిపడి పోవటం విద్యావంతుల లక్షణం కాదు. ధనమూ స్థిరమైనది కాదు. ఇంక దారా పుత్రాదులు మధ్యలో ఆవరించి, మధ్యలో విడిపోయే వారే. పెళ్ళికి పూర్వము భార్య ఎవరు, భర్త ఎవరు ఎవ్వరికీ తెలియదు. మధ్యలో వచ్చి మధ్యలోనే ఒకరికొకరికి వియోగం సంభవిస్తుంది. బిడ్డలూ అంతే. పుట్టక పూర్వము తల్లి ఎవరు? బిడ్డ ఎవరు? పుట్టిన తరువాతనే ఈ విధమైన సంబంధ బాంధవ్యములు కలిగి ఉంటాయి. ఇవన్నీ అస్థిరములే. మరి స్థిరమైనది ఏమిటి? ధర్మము, కీర్తి. ఇవి రెండే మానవులకు స్థిరమైనవి.

## చర్మచక్షువులు - జ్ఞానచక్షువులు

ఈ దృశ్యకల్పితమైన చరాచర ప్రపంచమంతయు కాలవాహినిలో కలిసిపోతుంది. ఏది మనకు కనిపించుచున్నదో, అది కొంత కాలములోనే కనుమరుగైపోతుంది. ఈ చర్మ చక్షువులకు గోచరమయ్యే ఈ దృశ్య కల్పిత జగత్తంతయు కాల గర్భంలో కలిసి పోయేదే. చూచే నేత్రము, చూడబడే విశ్వము రెండూ అనిత్యములే. ఈ చర్మ చక్షువులు కేవలము మానవులకు మాత్రమేకాదు, పశు పక్షి మృగాదులకు, క్రిమి కీటకాదులకు కూడా ఉంటున్నవి. మానవుని విశిష్టత ఏమిటి? జ్ఞానచక్షువులను తాను అభివృద్ధిపరచుకొనకుండినచో, ఈ చర్మచక్షువులుండియూ పశు పక్షి మృగాదులతో సమానుడగును. మానవ జీవితము అమూల్యమైనది, అర్థవంతమైనది, అనుభవించదగినది. ఇట్టి పవిత్ర మానవ జీవితమును సార్థకము గావించుకొనవలెనన్న ఆత్మజ్ఞానము అత్యవసరము. అందు చేతనే "జంతూనాం నర జన్మ దుర్లభం" అన్నారు. ఇది దుర్లభమే. జ్ఞానమే లేకుండిన పశువుతో సమానమే. "జ్ఞానేన శూన్యః పశుభిస్సమానః". ఈ చర్మ చక్షువులు కేవలము బాహ్యమైన, స్థూలమైన జగత్తును చూడగలుగుచున్నవేకానీ, సూక్ష్మమైన దివ్యత్వమును గుర్తించుటకు దీనికి సాధ్యము కాదు.

ఎవరి నేత్రములు వారే చూడలేరు. ఎవరి నేత్రము వారినే చూడలేదు. మీ నేత్రములు మీరు చూడగలుగుచున్నారా? లేదు. ఏదో ఒక ఆధారమును పురస్కరించుకొని, మీ నేత్రములను మీరు చూడగలుగుచున్నారు. ఆధారమే లేకుండినచో మానవుడు తన నేత్రములను తాను చూడలేకపోతున్నాడు. ఈ స్థూలనేత్రము స్థూలదేహమునే గుర్తించలేనప్పుడు, సూక్ష్మమైన మనస్సును ఏరీతిగా గుర్తించగలదు? సూక్ష్మమైన మనస్సునే గుర్తించలేని నేత్రములు అత్యంత సూక్ష్మమైన ఆత్మతత్త్వాన్ని ఏరీతిగా గుర్తించగలవు? కనుక చర్మచక్షువులు సహజమైన జీవితానికి దృశ్యకల్పిత జగత్తును చూపించునవి మాత్రమే. జ్ఞాననేత్రములు ప్రతి మానవునకు అత్యవసరము. జ్ఞాననేత్రమన్నా, దివ్యనేత్రమన్నా, ఆత్మనేత్రమన్నా, బ్రహ్మనేత్రమన్నా ఒకదానికొకటి పర్యాయపదములు.

"సర్వం బ్రహ్మం" అనే భావాన్ని మనము విశ్వసించినప్పుడే జగత్తంతయు బ్రహ్మభావముతో రూపొందుతుంది. ఎట్టి భావమో అట్టి దృశ్యము, ఎట్టి రంగో అట్టి ప్రకృతి, దృష్టిని జ్ఞానమయంగా మార్చుకొన్నప్పుడే సృష్టి బ్రహ్మమయంగా రూపొందుతుంది. మన చర్మచక్షువులకు ఏవిధమైన అద్దములు ధరింతుమో ప్రకృతి అంతయు అదే రంగులతో కనిపిస్తుంది. కనిపించేవన్నీ మార్పు చెందునవే. మార్పుచెందే ఈ దృశ్యములకు మార్పుచెందని బ్రహ్మతత్త్వము ఆధారమై ఉంటుంది. మనము కారులో లేక బస్సులో ప్రయాణమైపోతున్నాము. బస్సు, కారు కదులుతాయి. రోడ్డుకదలటంలేదు కదా! కదలని రోడ్డును ఆధారము చేసుకొని కదిలే బస్సు, కారు ప్రయాణము నలుపుచున్నాయి. కదిలే ఈ జగత్తునకు, మార్పుచెందే ఈ జగత్తునకు కదలని, మార్పుచెందని దివ్యత్వము ఆధారమై ఉంటున్నది. అట్టి ఆత్మతత్త్వాన్ని గుర్తించుకొంచేనే ఈ జగత్తుయొక్క రహస్యమంతయూ సులభంగా మనకు అర్థమవుతుంది.

## బ్రహ్మసత్యాన్ని గుర్తించు

ఈ జగద్భావము అర్థము కాకుండా పోవటానికి కారణం మనస్సే. ప్రవృత్తి మనస్సుయొక్క లక్షణం. ఈ దృశ్య వస్తు వాహనములందు రాత్రింబవళ్ళు జీవితమును వ్యర్థం గావించుకొంటున్నాము. దీనికోసమ మనము జన్మధరించినామా? కాదు కాదు. బ్రహ్మసత్యాన్ని గుర్తించాలి. దీనిని గుర్తించాలనుకొన్నప్పుడు బ్రహ్మతత్త్వాన్ని చింతించాలి. తెలుసుకొనుటకు, చూడటానికి, సంభాషించటానికి ప్రయత్నించాలి. అదే నిజమైన Religion. Man must realise God. See God, seek God, talk to God, this is religion. కాబట్టి మానవుడు మొట్టమొదట గుర్తింపవలసినది దైవత్వమును. దానిని తెలుసుకోకుండా ఎన్నింటిని తెలుసుకొన్నప్పటికిని ప్రయోజనము లేదు.

## నీవే ఆనందస్వరూపుడవు

ఆత్మానందము మనకు ఏవిధముగా లభిస్తుంది? దేహముచేత లభిస్తుందా? కాదు. మనస్సుచేత లభిస్తుందా? కాదు. దేహమునకు, మనస్సునకు లభించే ఆనందము తాత్కాలికమైన ఆనందము. ఈలాంటి ఆనందము నిమిత్తమై మానవుడు సృష్టింపబడ లేదు. శాశ్వత ఆనందమును అనుభవించే నిమిత్తమై మానవుడు తానే తన రూపాన్ని ధరించుకొన్నాడు. నీవే ఆనందస్వరూపుడవు. నీవు ఈ విషయాన్ని గుర్తించుకొనలేకపోతున్నావు. రాగ ద్వేషములచేత, అహంకార మమకారములచేత, అనుమాన ఆహ్లాదములచేత ఈ ఆనందము కప్పబడి ఉంటుంది. రాగ ద్వేషములు దట్టమైన బట్టలు. ఇవే మన ఆనందానికి అడ్డువస్తున్నాయి. ఈ రాగ ద్వేషములను మనము దూరము గావించుకొన్నప్పుడు మన స్వస్వరూపాన్ని మనము దర్శించగలము. కనుక ఆనందము మనమే. తానే ఆనందమై తిరిగి ఆనందాన్ని తెలుసుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. ఇది ఎంత వెఱ్ఱితనము? తనయందే

సర్వము ఉండినప్పటికిని, బాహ్యమైన విషయవాంఛల చేత దృశ్య కల్పిత జగత్తునందు అనేక రకములైన వాంఛలను అనుభవించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రయత్నమంతయు ఏరీతిగా ఉంటున్నదంటే, "కోరిన ఫలాన్ని అనుగ్రహించే కల్పవృక్షము తన ఇంట నుండగా ఫెరటి పుష్పములకై పీతిపడునట్లుగాను, అడిగిన పాలిచ్చు కామధేనువు తన ఇంటనుండగా ధనమిచ్చి ఆవును కొన్నట్లుగాను, బంగారుపర్వతము తన ఇంట నుండగా వెండి బంగారాలకై వెతికినట్లు" ఉన్నది. అదే రీతిగనే సర్వము తానై యుండగా ఈ అల్పమైన విషయాలకు మనము ఎందుకు ఆరాటపడు తున్నాము? దీనికి కారణము తానే ఆనందస్వరూపు డననే సత్యాన్ని తెలియకపోవటమే.

విద్యార్థులారా! మీకు తెలిసిన విషయమే. మదపుటేనుగు ఉంటుంది, దాని బలము ఎంతటిదో అనుభవించే వానికి అర్థమవుతుంది. అన్యులకు అర్థ ముకాదు. తొండంతో కొట్టిందంటే తొమ్మిదడుగులు పోయి పడతాడు. అంత బలమైన ఏనుగు బలహీను డైన మావటి, చేతిలో అంకుశము పట్టుకున్నప్పుడు, చెప్పినట్లు వింటుంది. వాని బలమెంత? ఏనుగు బల మెంత? తనశక్తి ఏనుగునకు తెలియదు. శక్తి ఉన్నదికాని తెలియక పోవటం చేతనే అల్పుడైన వాని చేతిలో అణిగిమణిగి ఉంటుంది. మరొక ఉదా హరణ: తుమ్మెద కఠినమైన కట్టెలనైనా తొలచుకొని అందులోనికి ప్రవేశిస్తుందంటే, దానికంతటి మహో న్నతమైన శక్తి కలదు. అట్టి తుమ్మెద కమలములో ప్రవేశించినప్పుడు, ఆ కమలం రేకులన్నీ ముకుళించి నప్పుడు, అందులో బంధింపబడి, తన శక్తిని తాను మరచి, అందులో మరణిస్తుంది. ఇంకొక ఉదాహరణ కస్తూరీ మృగము తన నాభి నుండి పుట్టే సుగంధాన్ని అనుభవిస్తూ అది ఎక్కడనుంచి వస్తోందని అడవి అంతా తిరిగి, అలసిపోయి వృక్షచ్ఛాయలో విశ్రాంతి తీసుకుంటుంది. విశ్రాంతి తీసుకొనే సమయములో తన ముక్కును తన నాభివద్ద ఉంచుకొని పవళిస్తుంది. తన నాభినుంచి వచ్చే సుగంధమును గుర్తించుకొని, "అయ్యో! నేనెంత పిచ్చిదానను. నానుండే వచ్చిన ఈ సుగంధాన్ని నేను తెలుసుకొనలేక, ఈ సుగంధం ఎక్కడ ఉన్నదని అడవి అంతా సంచరించి అలసి పోయాను" అని అనుకుంటుంది. అదే అజ్ఞానము యొక్క తత్త్వము. మానవుడు తనలో ఉండిన ఆనందమును, దివ్యత్వమును, పవిత్రతను గుర్తించు కోవటానికి తగిన ప్రయత్నము చేయుటలేదు. చేయక పోగా చెప్పిన మాటలు విశ్వసించుటలేదు. దానికి తగిన కృషి చేసినప్పుడు తప్పక ఆ సత్యాన్ని అనుభ వించగలడు.

## ఆత్మ ఆనందమయం

నిత్యానందము, బ్రహ్మానందము, అద్వైతానం దము అనేవి మానవుని స్వరూప స్వభావములు. బాహ్య, భౌతిక, ప్రాకృత సంబంధమైన విషయ వాసనలకు లోబడి ఆ దివ్యమైన, భవ్యమైన, నవ్య మైన తత్త్వాన్ని అర్థము చేసుకొనలేక పోతున్నాడు. అనుభవించలేక, అన్వేషించలేక బాధపడుతున్నాడు. పాత్రలో పాయసముపోసి ఆ పాత్రకు ఎన్ని రంధ్ర ములు కొట్టినా, ఏరంధ్రము నుండి వచ్చినా పాయసమే వస్తుంది కాని మరొక చేదు పదార్థము రాదు. ఆత్మ ఆనందమయము. కనుకనే ఋషులు ఆత్మకు "ఆనం దము" అని పేరుపెట్టారు. ఏలాంటి ఆనందము? "నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం ద్వంద్వాతీతం గగనసదృశం - ఏకం నిత్యం విమలం అచలం సర్వధీసాక్షిభూతం భావాతీతం త్రిగుణ రహితం". ఇవి ఆత్మ స్వరూప స్వభావముల సరి యైన గుర్తులు. ఇట్టి ఆనందము ఏనాడు దుఃఖమును కాని, కష్టమును కాని, బాధను కాని, విచారమును కాని అందించదు. అట్టి పెన్నిధి నీ సన్నిధినే ఉండగా దుఃఖములు, విచారములు, కష్టములు కలిగించే ఈ జగత్తునకై మీరెందుకు ఇంత ఆరాట పడుతున్నారు?

## " అనిత్యం అసుఖం లోకం "

ఆనందమనే నిధిచుట్టూ అహంకారమనే సర్పము సర్వత్రా, నిర్విరామముగా సంచరిస్తూ కాపాడుతోంది. ఎవ్వరూ దానివద్దకు వెళ్ళలేకపోతున్నారు. ఎవడు ఈ అహంకారమనే సర్పమును నిర్మూలించునో, అట్టి వానికే ఈ ఆనందమనే నిధి లభ్యమౌతుంది. అహంకారము కేవలం అజ్ఞానముచేత ఆవరించినది. అహంకారమునకు కారణము ఏమిటి? ధనమా ? బలమా ? అధికారమా? స్థానమా?విద్యనా? ఇవేవీ కారణంకాదు. ఇవన్నీ అల్పమైన శక్తులు. దేహభ్రాంతియే దీనికి మూలకారణము. ఇవన్నీ ఎంతకాలం ? అందుకోసమే శంకరాచార్యులు "మాకురు ధన, జన, యవ్వన గర్వం హరతి నిమేషాత్కాలస్సర్వం" అన్నారు. ఇవి క్షణములో మార్పు చెందుతాయి. ఇవన్నీ అనుభవించిన వ్యక్తులు స్థిరముగా ఎక్కడ ఉన్నారు? గొప్ప గొప్ప పదవులనంతా నేలి, సిరిసంపదలను అనుభవించి ప్రఖ్యాతి పొందిన హరిశ్చంద్రుడు, నల మహారాజు, మాంధాత, శ్రీరామచంద్రుడు మున్నగు వ్యక్తులంతా ఎక్కడ ఉన్నారిప్పుడు ? నేడు వారెవ్వరునూ లేరు, భారతదేశము నందు ప్రాచీనకాలము నుండి అనేకమంది అనేక రకములైన సాధనలునల్పి, ఇవన్నియు అనిత్యమని లోకానికి చాటుతూ వచ్చారు. అందుకోసమే "అనిత్యం అసుఖం లోకం" అని భగవద్గీత చాటి చెప్పింది. ఏదీ మన వెంటరాదు. వచ్చేవి రెండే. అవే మంచి, చెడ్డ. మనము ఏది చేస్తామో అది మాత్రము మనవెంట వస్తుంది. మంచిని చేసి మంచిని పొందండి. ఏ విత్తనము నాటుతామో అదే ఫలము మనకు లభిస్తుంది.

## ఆదర్శవంతమైన కర్మలాచరించు

భారతీయులు కర్మఫల సిద్ధాంతమును విశ్వసించినవారు. నీవు ముండ్లబీజములు వేసినా, పండ్లబీజములు వేసినా అవి తిరిగి మొక్కలుగా వస్తాయి అట్టి విశ్వాసమే భారతీయుల విశ్వాసం. నీ హృదయంలో మంచిని ఆవిర్భవింపచేసుకొని, "నేను ఆత్మస్వరూపుడను, నా భావము బ్రహ్మభావము, నేనీపని చేయదగినదా? చేయదగనిదా?" అనే విచారణ కలిగి ఉండాలి. తన దివ్యత్వమును విస్మరించి, అనాత్మ సంబంధమైన తుచ్ఛకార్యములలో ప్రవేశించుట మంచిదికాదు. ప్రతీ కార్యమునందు తన దివ్యత్వాన్ని స్మరించి కార్యంలో ప్రవేశించాలి. అప్పుడే దోషమునకు, పాశమునకు, మోసమునకు దూరమవుతాడు. అప్పుడే ఆత్మాశయంలో ప్రవేశిస్తాడు. ఇటువంటి విచారణ విద్యార్థులకు చాల అవసరము. మన విద్య ఆత్మవిద్య. మనము దీనిద్వారా పవిత్రమైన ఆశయమును లోకానికి అందించాలి. కర్మయే మనకు లక్ష్యం. పవిత్రమైన, ఆదర్శవంతమైన కర్మలు ఆచరించాలి. అన్యులకు సహాయకరమైన కర్మలు ఆచరించాలి. దేశోద్ధరణకు జీవితమును అంకితము చేయాలి. మన దేశము మాతృదేశము. మాతృ స్వభావము లేకపోతే మనము ఏవిధముగా జగత్తులో ఉండగలము ? లోకోద్ధరణకై మన జీవితమును అంకితము చెయ్యాలి.

## సుభాష్ చంద్రబోస్ మాతృ దేశాభిమానం

సుభాష్ చంద్రబోస్ కలకత్తాయూనివర్సిటీలో చదువుతున్న సమయమున ఒక బ్రిటిష్ లెక్చరర్ భారతదేశాన్ని, భారతీయులను గురించి హేళనగా, అలక్ష్యంగా చెప్పడం జరిగింది. సుభాష్ చంద్రబోస్ మాతృదేశ దూషణమును వినలేకపోయాడు. "ఇది నా ప్రియ మాతృదేశము. ఇది నా ప్రియమాతృభాష ఇదే నా మతము" అని మాతృదేశమునకై త్యాగము చెయ్యాలని సంకల్పించుకొన్న వ్యక్తి. ఆతడు లెక్చరర్ మాటలను వినలేకపోయాడు. కొంతసేపు ఓపికపట్టినాడు. ఒక్కసారి మూడు దెబ్బలంతా ఎగిరిపోయేసి ఆ బ్రిటిష్ లెక్చరర్ తలపట్టుకొని, చెప్పు

తీసుకొని ఊరికే కొట్టేవాడు. "దేవినైనా నేను సహిస్తాను. నా మాతృదేశాన్ని దూషించటం నేను సహించలేను. నేను నరకమునకు పోయినా ఫరవాలేదు, నా దేశగౌరవాన్ని నేను కాపాడుకోవాలి" అని దేశాభిమానం వ్యక్తం చేసాడు. తక్కిన విద్యార్థులు ఏమీ చేయలేకపోయారు. పులిపిల్లవలె ఎగిరి ఆతడిని అనేక రకములుగా హింసించాడు. లెక్చరర్ Help me, help me అంటున్నాడు. కానీ ఎవరూ సహాయం చేయలేదు.

ఈ వార్త యూనివర్సిటీ అంతా ప్రాకిపోయింది. అధికారులు ఎమర్జెన్సీ మీటింగ్ పెట్టుకొని 5 సం။లు కలకత్తా యూనివర్సిటీలో సుభాష్ చదవటానికి వీలు లేదని నిర్ణయం తెలియచేశారు. దానితో సుభాష్ చదువును త్యాగం చేసినాడు. అటుపిమ్మట తండ్రి ఈ విషయాన్ని తెలుసుకొని లండన్ పంపించినాడు. అక్కడ శ్రద్ధాభక్తులతో చదివి ICS Pass అయ్యాడు. భారతదేశానికి తిరిగివచ్చి మాతృ దేశాభిమానముతో రాజకీయరంగంలో ప్రవేశించినాడు. ఇదే నిజమైన త్యాగము. స్వార్థాన్ని త్యాగంచేసి, పరార్థాన్ని విశ్వసించి, పరమార్థాన్ని పొందాలి.

## సమత్వాన్ని పెంచుకోండి

విద్యార్థులారా!

పదవుల కోసమనిగాని, పేరు ప్రతిష్ఠలకోసమనిగాని మీరు ప్రాకులాడకండి, దేశాభిమానము, దైవాభిమానము, ధర్మాభిమానము — పెంచుకోండి. సత్య ధర్మములు రెండూ అవినాభావ సంబంధములు. ఏ మతాన్ని మనము విమర్శించకూడదు. "నా మతం గొప్పది, నీ మతం చిన్నది" అనే సంకుచిత స్వభావాలతో వాదోపవాదములకు దిగరాదు. ఈ విధమైన సమత్వాన్ని మనము అనుసరిస్తూపోతే తప్పకుండా మనలో దివ్యత్వమనేది ఆవిర్భవిస్తుంది. కాబట్టి విద్యార్థులు విద్యతోబాటు సమత్వం, ప్రేమతత్త్వం అనుభవించి దివ్యత్వమైన ఏకత్వాన్ని పొందటానికి, అనుభవించటానికి తగిన కృషిచేయాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ

1—జూన్—1990.

బృందావనం.

## సత్యసాయి మహితోక్తులు:

1) ఎండమావులెంత పారినా తడవనట్లు, శ్రద్ధలేకున్న కర్మలెన్ని చేసినను చిత్తశుద్ధి కలుగదు. 2) ఎక్కడ భగవన్నామ సంకీర్తన జరుగునో అదియే వైకుంఠం. 3) ఏకాంతమనగా ఎవరిచేతనూ బాధ కలుగకుండా ఉండునట్టిస్థలము. 4) ఏకాకి అనగా రెండవవారు లేకుండుట. 5) ఏడ్చేవాడు నరుడు, నవ్వేవాడు నారాయణుడు. 6) ఐహిక సంబంధమునకు మాయయే కారణము. 7) ఓర్పే మానవునకు సర్వబలము. 8) కరిగే ఆయుస్సు, కదిలే జలము తిరిగిరావు. 9) కర్తవ్యపాలనయే ధర్మం. 10) ధర్మబద్ధమైనజీవితమే సత్ప్రవర్తన. 11) కర్మజిజ్ఞాస ఉంటే, ధర్మజిజ్ఞాస ఉంటుంది. ధర్మజిజ్ఞాస ఉంటే బ్రహ్మజిజ్ఞాస అనుభవింపగలం. 12) కర్మసంబంధి జీవుడు, భక్తిసంబంధి దేవుడు. 13) ఎల్లెడ భగవంతుడున్నాడని విశ్వసించితే, ఎందెందు వెదకి చూచిన భగవంతుడు అందందే కానవచ్చును.

# సాయిమాట — సాయిబాట

మనం స్వామి మాటలను ఆచరణలో పెట్టినప్పుడే, మనం స్వామిబాటలో నడచినట్లగును. స్వామి మన కొరకవతరించి, మన కొరకు ఎన్నెన్నో మంచి మాటలు చెప్పుచున్నారు. ఆ మాటలను మనం ఎంతవరకు నిత్యజీవితంలో అమలుపరుస్తున్నామో చూడాలి. "మనుష్యులకు బోధించే దానికంటే, నీ మనస్సునకు బోధించు" అన్నారు స్వామి. నిజంగా మనమంతా ఇతరులకు చెప్పడానికి ఎంతగానో ప్రయత్నిస్తాం. కానీ, మన మనస్సునకు బోధించం. ఇతరులకు చెప్పడానికే ఎన్నెన్నో పుస్తకాలు చదువుతాం. అందులకే స్వామి— "గ్రంథపఠన వాదనకేగాని, సాధనకు పనికిరాదు" అన్నారు. దీని అర్థం గ్రంథపఠన మానమని కాదు. ఏది చదివినా, ఏది బోధించినా, ముందుగా ఎవరికివారు బోధించుకోవాలి. ఆ తర్వాతనే తెలుసుకొన్నదానిని సాధనలో ఉంచాలికాని, ఎన్నో విషయాలు చదివినానని, తెలుసుకొన్నానని వాదనకు దిగవద్దని, ఏది తెలుసుకొన్నా ప్రేమమయ జీవితం గడపాలని, ఆ ప్రేమను పదిమందికి పంచిపెట్టాలని సాయిమతం.

"మీ ఆనందమే నా ఆహారం" అన్న స్వామి మాటలను గుర్తించుకొంటే, ప్రతీక్షణం మధురానుభూతులతో, ఆనంద తరంగాలలో మున్కలు వేస్తాం. ఏదినమైతే, మనం ప్రాపంచిక విషయాలలోపడి బాధపడుతామో, ఆ దినం మనం స్వామికోరే ఆహారాన్ని అందించలేము. నిరంతరం "సాయిరాం-సాయిరాం" అనే మనం, కనీసం స్వామికి ఆనందమనెడి ఆహారం ఇవ్వనిచో, మనమేరీతిగా సాయిదేవుని బాటపైన నడిచినట్లగును? "ఇక్కడనుండి నేను ఆనందమనే ఆహారాన్ని పర్తికి ఎలా పంపగలను? మన ఆనందం ఆ స్వామికి ఆహారమెట్లగును?" అనే సందేహాలు అనేకం కలుగవచ్చు. దీనికి ముందుగా ఒక్క విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. సాయిరాముడు ఒక్క పర్తిలోనేకాదు, అందరి హృదయాలలో కూడా నివసించియున్నాడు. మనం ఆనందమనే ఆహారాన్ని మన హృదయసాయికి అనుక్షణం అందించవచ్చును. అప్పుడు మన హృదయసాయి ఆహారమే మన ఆనందమవుతుంది. అందులకే మనమంతా నిరంతరం ఆనందమయంగా తేజోమయంగా ఉండాలి.

స్వామి మాటను, సాయి మాటలను మనం మన నవనాడులలోనికి పంపాలి. హృదయంలో స్వామివారి సందేశాలను పదిల పర్చుకోవాలి. పైన పైన వినివదలేవారు స్వామి మార్గంలో నడచుకొనేవారెట్లా అవుతారు? అందులకే స్వామి ఇలా అన్నారు- "నేను భగవంతుని భక్తుడి"ని మీరంతటికి మీరు- ఎవరంతటికివారు చెప్పుకొంటే సరికాదు. భగవంతుడు- "నీవు నా భక్తుడవ"ని తాను చెప్పాలి. అలా చెప్పించుకొన్నవాడే, నిజమైన భక్తుడు. ఆరీతిగా తాను చెప్పించుకోవాలనుకొంటే, సాయిమాటలను ఆచరణలోపెట్టాలి. కొంతమంది మనలో స్వామిని గురించి ధ్యానము చేద్దామన్నా, సాయిభజనలలో పాల్గొందామన్నా, సేవాకార్యక్రమాలలో పాల్గొందామన్నా- 'పనిభారం' ఎక్కువైనదని ఏవేవో అనేకమైన సాకులు చెప్పుకుంటూ ఉంటారు. ఇటువంటివారికి స్వామి— "సారము వెదకువాడు భారము చూడడు" అని పేర్కొన్నారు. మనము సాయిమార్గంలో సారాన్ని, ఆనందాన్ని గ్రోలాలంటే త్యాగమయ జీవితం గడపాలి.

" జీవులను బాధించి దేవుళ్ళను పూజించిన ఫలమేమి ?" ప్రాణంతో కనబడే ఎద్దులను బాధించి, రాతి ఎద్దును పూజింపతగునా? అని అనేకసార్లు స్వామి బోధించినారు. అందులకే మనం- స్వామి రూపంతో బాటు, స్వామి మాటలను కూడా ప్రేమించాలి. అప్పుడే పరిపూర్ణంగా స్వామిబాటపైన నడిచినవార మౌతాము. మనం స్వామి మాటలను ఆచరణలో ఉంచక, ఎన్ని భజనలు చేసినా స్వామి సంతోషిస్తారా? స్వామికి ఆత్మార్పణం చేసుకోవాలి. మన ఆచరణ వలన స్వామియే మనలను పట్టుకొని నడిపించేరీతిగా తయారుకావాలి. లేకపోయినచో, మనం మన కోరికల నిమిత్తం స్వామివారిని ఆశ్రయించి, ఆ కోరికలు తీరగానే, స్వామిని వదలిపెట్టడం భక్తుని లక్షణం కాదు. అందులకే- "పాలముంచినా, నీటముంచినా భారంనీదే !" అన్నాడు త్యాగరాజు. "మార్జాల కిశోర" న్యాయం రీతిగా మన సమస్తబాధ్యతలను స్వామికే అంకితంచేసి, మనస్ఫూర్తిగా ఆ భగవానుని పాద పద్మములను ఆశ్రయించాలి. అంటే "సంపూర్ణశరణా గతి "తత్త్వానికి దాసోహం చేయాలి. అప్పుడే శరణా గతవత్సలుడై సాయి కనికరిస్తాడు.

స్వామి అందరిలో ఉన్నాడన్న విశ్వాసం మన కుంటే, స్వామిని స్వామిరూపంలోనే కాక, అన్ని రూపాలలోను ఉన్న స్వామిని ఆరాధిస్తాం. అందులకే స్వామి- "మీరు నా పైన చూపే ఈ అవ్యాజమైన ప్రేమను మీతోటి మానవులందరి మీదా చూపండి. అందరియందు నేనున్నాను. నా యెడల మీకుండు భక్తికి నిదర్శనంగా పరదూషణ, నేరారోపణ, ద్వేష ము ను- విసర్జించి పరులయెడ ప్రేమ, సేవాతత్పరత పెంచుకొని వారికి తగినసహాయ సహకారములను వారికి అందజేయండి"అని పర్తినాథుడు ఎన్నిసార్లు పేర్కొని యున్నారు. "మంచికున్న స్వేచ్ఛ చెడ్డకులేదు, చెడ్డ కున్న ఆకర్షణ మంచికిలేదా"ని ఒక సామెత కలదు. దీనికొక ఉదాహరణ : నేటి సినిమాలు. వీటి ఆకర్ష ణలోపడి చాలామంది దురాలోచన, దురలవాట్లకు అల వాటుపడుచున్నారు. బావినీటిలో లీటరు పాలను కలిపిన ఎట్లుండునో, అదేరీతిగా నేటి సినిమాలలో కూడా మంచిని అంతే కలిపినారు. సినిమా విషయంలో మనలను స్వామి గట్టిగా హెచ్చరిస్తూ ఇలా అన్నారు- "తత్త్వ మడుగంటె సినిమాలు తలకువచ్చె, ఒప్పు లవియన్ని సంఘాల తప్పులయ్యె. యుక్తి కేంద్రాలుగా మారె భక్తియందు" సత్యమును తెలుపుబాట శ్రీసత్య సాయిమాట. స్వామియే స్వయంగా మనకిట్టి "అమృత వాక్కులందించినా", మనలో చాలామంది నిర్లక్ష్యం చేస్తున్నారు. ఈ విషయంలో ఇంకా అంతటితో ఆగక, తిరిగి ఇలా అన్నారు- "పుణ్యకార్యాలుచేయ వీలులేకున్నను, ఇష్టం లేకున్నను పాపములు మాత్రం తలచకు చేయకు ఇది ఎంతో ఉత్తమం". కొన్ని కష్టాలు రాగానే "స్వామి నాపైన అనుగ్రహం చూప డంలేదే !" అనేటటువంటి వారికి "దైవ దండన దయకొరకే" అని స్వామి తెల్పినారు, మరియి— "నాలుకతో భగవన్నామం, చేతులతో దీనజనసేవ చేయండి" అని అన్నారు. ఈ విషయంలోనే స్వామి "దిల్ మే రాం. హత్ మే కాం" అని అంటారు.

"భగవంతుని యందు భక్తి, జీవులయందు రక్తి, సేవయందు ఆసక్తి" ఉంచమన్నారు స్వామి. మన కర్తవ్యంకూడా కార్యరూపంలో ఎలాచేయాలో తేటతెల్లంచేసినారు. "దైవ ప్రీతి, పాపభీతి, సంఘనీతి మానవజీవితానికి ఆదర్శములుగా ఉండాల"ని స్వామి పెక్కుసార్లు బోధించినారు.

స్వామి ఉపన్యాసం చదువుచున్నామంటే, స్వామి రూపం కళ్ళల్లో మెదలినట్లౌతుంది. అందుచేత, సాయి మాటలను ఆచరణలో చూపిస్తూ, మనమంతా సాయి బాటలో సాగిపోదాం.

కె. ఆనందసాయి

కదుకుంట్ల, మహబూబ్‌నగర్ జిల్లా.